# 2. ऊरुभङ्गम्
## (ఊరుభంగము)

– भासः

## I. పరిచయము

**కవికాలాదులు :**

భాసుడు సంస్కృత వాఙ్మయములో ప్రసిద్ధుడైన రూపకకర్త. ఇతని కాలనిర్ణయానికి ఆధారాలు ఏమీలేవు. కానీ కాళిదాసు భాసుని పేరు స్మరించడంచేత ఇతడు కాళిదాసు కంటే పూర్వుడనీ ఇతడు 4వ శతాబ్దానికి చెందినవాడని పండితులు నిర్ణయించారు. ఈతని నాటకాలుగా ప్రస్తుతింపబడుతూ 13 రూపకాలు ప్రచారంలో ఉన్నాయి. వాటిలో ఉండే భాషా శైలినిబట్టి అనేకములైన ఆధారాలనుబట్టి ఇవన్నీ ఒకే కవి రచనలనియూ, 1922 సం॥లో మహాపండితుడైన గణపతిశాస్త్రిగారు పరిష్కరించి భాసకృతములుగా నిర్ణయించిరి. మహాభారతము, బృహత్కథ, రామాయణము మొదలైనవానిలో జరిగిన ఏదైనా ఒక సంఘటనను ఆధారముగా చేసుకొని ఈ నాటకములు రచింపబడినవి. అతని శైలి సులభమైనది. దీర్ఘసమాసములెచ్చటా కానరావు. భాసుని రచనలన్నియూ భరతుని నాట్యశాస్త్రమున కనుగుణముగా రచింపబడినవి. ఈతని రచనలన్నియూ రంగస్థల ప్రదర్శన కనువైనవి.

**భాసుని రచనలు :**

1. ప్రతిమా నాటకము
2. అభిషేక నాటకము
3. పంచరాత్రము
4. మధ్యమ వ్యాయోగము
5. దూతఘటోత్కచము
6. కర్ణభారము
7. దూత వాక్యము
8. ఊరుభంగము
9. బాలచరితము
10. దరిద్రచారుదత్తము
11. అవిమారకము
12. ప్రతిజ్ఞాయౌగంధరాయణము
13. స్వప్న వాసవదత్తము

వీనిలో ప్రతిమానాటకము, అభిషేకము రామాయణమునాధారముగా చేసికొని రచింపబడినవి. పంచరాత్రము, మధ్యమ వ్యాయోగము, దూతఘటోత్కచము, దూతవాక్యము, కర్ణభారము, ఊరుభంగము, మహాభారతము నాధారముగా చేసుకొని రచింపబడినవి. ప్రతిజ్ఞా యౌగంధరాయణము, స్వప్నవాసవదత్తము బృహత్కథ నుండి గ్రహింపబడిన ఇతివృత్తము కలవి. అవిమారకము, చారుదత్తము భాసుని స్వతంత్ర రచనలు. బాలచరితమొక్కటే భాగవతము నాధారముగా చేసుకొని రచింపబడినవి.

భాసుడు ఇతివృత్తమును స్వీకరించినప్పటికినీ నాటకమునకనుగుణముగా అనేక మార్పులను చేసెను.

ఊరుభంగము :

ఊరుభంగము మహాభారతమునాధారముగా చేసుకొని రచింపబడినది. ఇది ఏకాంకిక. భీమదుర్యోధనుల గదాయుద్ధము తరువాత, వంచనతో ఊరువులు నాశనమైన దుర్యోధనుని మరణము వరకు జరిగిన కథ వర్ణింపబడినది. కథానాయకుడైన దుర్యోధనుని మరణము వర్ణింపబడుటచే ఇది కరుణరస ప్రధానమైనది. ఇతివృత్తము మహాభారతము నుండి గ్రహింపబడినప్పటికీ కవి నాటక రచనకనుగుణముగా అనేక మార్పులు చేసెను. నాటక ధర్మాలకు విరుద్ధంగా దుర్యోధనుని మరణం రంగస్థలంపై చూపబడింది. ఇది గ్రీకు ట్రాజెడీలను పోలివున్న ఏకైక నాటకమని పాశ్చాత్యుల అభిప్రాయము.

## II. అనువాదములు

**( नान्द्यन्ते ततः प्रविशति सूत्रधारः )**

**(నాంద్యన్తే తతః ప్రవిశతి సూత్రధారః)**

నాంది చివరలో సూత్రధారుడు ప్రవేశించును.

(నాంది - నాటక ప్రారంభంలో చేయబడు ప్రార్థన. नन्दन्ति अनेन देवाः - దేవతలు దీనితో సంతోషించెదరు కావున ఇది నాంది. आशीः नमस्क्रिया वस्तुनिर्देश एव वा - అని నాంది మూడు విధములు. ఈ నాంది ఆశీఃపూర్వకముగా గాని, నమస్కారపు రీతిలోగాని, ఇతివృత్తమును సూచించు రీతిలో కాని ఉండును).

**सूत्रधारः** सूत्रं धारयति इति सूत्रधारः నాటకమును నడిపించువాడు. ఇతడు నాందీ శ్లోకమును పఠించును. నాటక సన్నివేశమును, రాబోవు పాత్రను కూడా సూచించును. ఈతడు ప్రస్తావనలో ప్రముఖమైన స్థానమును కలిగియుండును.

**सूत्रधारः**

भीष्मद्रोणतटां जयद्रथजलां गान्धारराजह्रदां
    कर्णद्रौणिकृपोर्मिनक्रमकरां दुर्योधनस्रोतसं,
तीर्णः शत्रुनदीं शरासिसिकतां येनप्लवेनार्जुनः
    शत्रूणां तरणेषु वः स भगवानस्तु प्लवः केशवः ॥ 1 ॥

భీష్మద్రోణతటాం జయద్రథజలాం గాంధారరాజహ్రదాం
    కర్ణద్రౌణికృపోర్మినక్రమకరాం దుర్యోధనస్రోతసం,
తీర్ణః శత్రునదీం శరాసిసికతాం యేనప్లవేనార్జునః
    శత్రూణాం తరణేషు వః స భగవానస్తు ప్లవః కేశవః ॥ 1 ॥

( भीष्मद्रोणतटाम् = భీష్ముడు ద్రోణుడు ఒడ్డులుగా కలిగినటువంటి, जयद्रथजलाम् = జయద్రథుడే (సైంధవుడు) జలముగా కలిగినటువంటి, गान्धारराजह्रदाम् = శకుని లోతైన చెరువుగా ఉన్నటువంటి, कर्णद्रौणिकृप + ऊर्मिनक्रमकराम् = కర్ణుడు, అశ్వత్థామ, కృపుడు అలలుగా, మొసలిగా,

మకరముగా ఉన్నటువంటి, दुर्योधनस्रोतसम् = దుర్యోధనుడే ప్రవాహముగా కలిగినటువంటి, शर + असि सिकताम् = బాణములు, కత్తి ఇసుకగా ఉన్నటువంటి, शत्रुनदीम् = శత్రువులనెడి నదిని, येन प्लवेन = ఏ తెప్పతో, अर्जुन: = అర్జునుడు, तीर्ण: = దాటినాడో, स:भगवान् केशव: = అటువంటి భగవానుడైన వాసుదేవుడు, शत्रूणां = శత్రువుల యొక్క, तरणेषु = దాటుట యందు (ఓడించుట యందు), व: = మీకు, प्लव: = తెప్ప, अस्तु = అగును గాక).

**భావము :** భీష్మ ద్రోణులు ఒడ్డులుగా కలిగినటువంటి, సైంధవుడే నీరుగా ఉన్నటువంటి, శకుని లోతైన చెరువుగా ఉన్నటువంటి, కర్ణుడు, అశ్వత్థామ, కృపుడు అలలుగా మొసలిగా ఉన్నటువంటి, దుర్యోధనుడే ప్రవాహముగా కలిగినటువంటి, బాణములు, కత్తి ఇసుకగా ఉన్నటువంటి, శత్రువులనెడి నదిని దాటుటకు అర్జుననకు ఏ భగవానుడైన వాసుదేవుడు తెప్పగా మారినాడో, ఆ వాసుదేవుడే శత్రువులనెడి నదిని దాటుటకు మీకు కూడా తెప్పయగును గాక !

(ఇది నాందీ శ్లోకము. శత్రువులను ఓడించుటకు భగవానుడు మీకు సహాయపడును గాక అని ఆశీర్వదించినాడు కావున ఇది ఆశీః పురస్సరము. అదేవిధముగా కవి దీనియందున్న ముఖ్యమైన పాత్రలను కూడా సూచించినాడు. దుర్యోధనుడు, భీష్ముడు, ద్రోణుడు మొదలైన వారందరినీ సూచించుటచే ఇది సూచ్యార్థ సూచనము).

एवमार्यमिश्रान् विज्ञापयामि। अये किं नु खलु मयि विज्ञापनव्यग्रे शब्द इव श्रूयते ? अङ्ग पश्यामि।

ఏవమార్యమిశ్రాన్ విజ్ఞాపయామి । అయే కిం ను ఖలు మయి విజ్ఞాపన వ్యగ్రే శబ్ద ఇవ శ్రూయతే. అంగ! పశ్యామి.

గౌరవనీయులైన ప్రేక్షకులకు నేను దీనిని తెలియజేసెదను. ఓ! ఇదేమి? నేను విన్నవించు సమయములో కలకలము వినిపించుచున్నది. కానిమ్ము చూచెదను.

(आर्यमिश्रा: = గౌరవనీయులైన ప్రేక్షకులు, विज्ञापनव्यग्र: = విన్నవించుటయందు కుతూహలముతో నుండగా, अङ्ग = కానిమ్ము. అలాగే మొదలైనవాటిని తెలియజేయు పదము, शब्द: + इव = शब्द इव)

(नेपथ्ये) (తెర వెనుక)

(నేపథ్యే)

एते स्मो भो: ! एते स्म:

ఏతే స్మో భోః ! ఏతే స్మః

ఓయీ మేము ఇక్కడ ఉన్నాము. ఇక్కడ ఉన్నాము.

**सूत्रधार:** भवतु विज्ञातम्

**సూత్రధారః** భవతు విజ్ఞాతమ్

**సూత్రధారుడు** – కానిమ్ము తెలిసినది.

प्रविश्य (ప్రవిశ్య)

ప్రవేశించి

पारिपार्श्विक: भाव कुतो नु खल्वेते

పారిపార్శ్వికః భావ కుతో ను ఖల్వేతే

పారిపార్శ్వికుడు - ఓ పూజ్యుడా ! ఎందువలన వీరు ....

(పారిపార్శ్వికుడు - సూత్రధారుని అనుచరుడు)

स्वर्गार्थमाहवमुखोद्यतगात्रहोमां

नाराचतोमरशतैर्विषमीकृताङ्गा: ।

मत्तद्विपेन्द्रदशनोल्लिखितै: शरीरै:

अन्योन्यवीर्यनिकषा: पुरुषा भ्रमन्ति ॥ 2 ॥

స్వర్గార్థ మాహవ ముఖోద్యత గాత్ర హోమాం

నారాచతోమరశతైర్విషమీ కృతాంగాః ।

మత్త ద్విపేన్ద్ర దశనోల్లిఖితైః శరీరైః

అన్యోన్యవీర్య ని కషాః పురుషాభ్రమన్తిః ॥ 2 ॥

భావము : స్వర్గమును కోరుచూ వారి శరీరములు యుద్ధమనెడి యాగాగ్నియందు ఆహుతి చేయబడినవి. వారి అవయవములు వందలకొలదీ భాణములతోనూ, తోమరములతోనూ గాయపరచబడినవి. వారి శరీరములు మదపుటేనుగుల దంతములచే ఛేదింపబడినవి. ఒక్కొక్కరి పరాక్రమములకు గీటురాయిల వలె ఉన్న శరీరములతో వీరందరూ సంచరించుచున్నారు.

(स्वर्ग + अर्थम् = స్వర్గము కొరకు, आहवमुख + उद्यतगात्रहोमां = యాగాగ్ని యందు అర్పించిన శరీరము కలవారు, नाराच = బాణములు, तोमर = ఈటె, शतै: = వందలకొలదీ, विषमीकृत + अङ्गा: = గాయపడిన అవయవములు కలవారు, मत्तद्विपेन्द्र = మదించిన ఏనుగుల యొక్క, दशन = దంతములచే, उल्लिखितै: = ఛేదింపబడిన, शरीरै: = శరీరములతో, अन्योन्यवीर्यनिकषा: = ఒకరి పరాక్రమమునకు మరియొకరు గీటురాయిల వలెయున్న, पुरुषा: = పురుషులు, भ्रमन्ति = సంచరించుచున్నారు).

**सूत्रधार:** मार्ष ! किं नावगच्छसि ? तनयशतनयनशून्ये दुर्योधनावशेषे धृतराष्ट्रपक्षे, पाण्डवजनार्दनावशेषे युधिष्ठिरपक्षे, राज्ञां शरीरसमाकीर्णे समन्तपञ्चके

**సూత్రధారః** మార్ష! కిం నావగచ్ఛసి ? తనయ శతనయనశూన్యే దుర్యోధనావశేషే ధృతరాష్ట్రపక్షే, పాండవజనార్దనావశేషే యుధిష్ఠిరపక్షే, రాజ్ఞాం శరీర సమాకీర్ణే సమంత పంచకే

**సూత్రధారుడు** - బుద్ధిమంతుడా! నీకు తెలియదా? ధృతరాష్ట్రుని పక్షమునందు వంద కుమారులనెడు కన్నులను పోగొట్టుకొని దుర్యోధనుడు మాత్రమే మిగిలియుండగా, పాండవులు వాసుదేవుడే యుధిష్ఠిర పక్షమునందు మిగిలియుండగా, రాజుల శరీరములతో కురుక్షేత్రము నిండియుండగా

(मार्ष = సూత్రధారుడు తన అనుచరుని 'బుద్ధిమంతుడా' అని సంబోధించుచున్నాడు. तनयशतनयन = వంద కుమారులనెడు కన్నులను, अवशेष = మిగిలియుండుట, బ్రతికి యుండుట, जनार्दन: = శ్రీకృష్ణుడు, समन्तपञ्चकम् = కురుక్షేత్రము)

एतद्रणं हतगजाश्वनरेन्द्रयोधं
    संकीर्णलेख्यमिव चित्रपटं प्रविद्धम् ।
युद्धे वृकोदरसुयोधनयो: प्रवृत्ते
    योधा नरेन्द्रनिधनैकगृहं प्रविष्टा: ॥ 3 ॥

ఏతద్రణం హతగజాశ్వ నరేంద్ర యోధం
    సంకీర్ణ లేఖ్యమివ చిత్రపటం ప్రవిద్ధమ్
యుద్ధే వృకోదర సుయోధనయోః ప్రవృత్తే
    యోధా నరేంద్ర నిధనైక గృహం ప్రవిష్టాః ॥ 3 ॥

ఈ యుద్ధభూమి మరణించిన ఏనుగులు, గుర్రములు, రాజులు, యోధులతో నిండియుండి అనేక రంగులతో కలసి నాశనమైన చిత్రపటము వలె యున్నది. భీమ దుర్యోధనుల మధ్య యుద్ధము ప్రారంభమగుచుండగా, వీరులందరూ రాజుల మరణమనెడి ఒకే గృహములోనికి ప్రవేశించుచున్నారు.

(एतत् + रणं = ఈ యుద్ధభూమి, हतगज + अश्व नरेन्द्र योधं = మరణించిన ఏనుగులు, గుర్రములు, రాజులు వీరులు కలది, संकीर्णलेख्यम् = కలసిపోయిన గీతలు రంగులు కలిగిన, चित्रपटम् = చిత్రపటము, इव = వలె, वृकोदर - सुयोधनयो: = భీమ దుర్యోధనుల మధ్య, युद्धे = యుద్ధము, प्रवृत्ते = ప్రారంభమగుచుండగా, योधा: = వీరులు, नरेन्द्रनिधन + एकगृहं = రాజుల మృత్యువనెడు ఒకే గృహములో, प्रविष्टा: = ప్రవేశించిరి)

निष्क्रान्तौ (నిష్క్రాన్తౌ)

ఇరువురు నిష్క్రమింతురు.

स्थापना స్థాపన

(स्थापना = నాటకము యొక్క పరిచయము చేయునది. దీనికే మరియొక పేరు ప్రస్తావన. నాటక ప్రారంభములో సూత్రధారుడు ఒక్కడే కాని, మరియొకరి సహాయముతో కాని ఈ స్థాపనను నిర్వహించును. సహాయకులుగా మారిషుడు, పారిపార్శ్వికుడు, నటి (సూత్రధారుని భార్య) ప్రవేశించుచుందురు. వారి సహాయముతో సూత్రధారుడు నాటక ఇతివృత్తమును, పాత్రలను పరిచయము చేయును).

तत: प्रविशति भटास्त्रय:

తతః ప్రవిశతి భటాస్త్రయః

తరువాత ముగ్గురు భటులు ప్రవేశింతురు.

**सर्वे** - एते स्मो भो: । एते स्म:

సర్వే - ఏతే స్మో భోః । ఏతే స్మః

అందరూ ఇక్కడే ఉన్నామండీ. ఇక్కడే ఉన్నాము.

**प्रथम:** - वैरस्यायतनं बलस्य निकषं मानप्रतिष्ठा गृहं
युद्धेष्वप्सरसां स्वयंवरसभां शौर्यप्रतिष्ठां नृणाम् ।
राज्ञां पश्चिमकालवीरशयनं प्राणाग्निहोमक्रतुं
संप्राप्ता रणसंज्ञमाश्रमपदं राज्ञां नभ: संक्रमम् ॥ 4 ॥

వైరస్యాయతనం బలస్య నికషం మానప్రతిష్ఠా గృహం
యుద్ధేష్వప్స రసాం స్వయంవర సభాం శౌర్యప్రతిష్ఠాం నృణామ్ ।
రాజ్ఞాం పశ్చిమకాల వీరశయనం ప్రాణాగ్నిహోమక్రతుం
సంప్రాప్తా రణ సంజ్ఞమాశ్రమపదం రాజ్ఞాం నభః సంక్రమమ్ ॥ 4 ॥

**భావము :** వైరమునకు స్థానము. బలమునకు (గీటురాయి) పరీక్ష. గౌరవమునకు, కీర్తికి గృహము. ఈ యుద్ధభూమి అప్సరసలకు స్వయంవర సభ. మానవుల పరాక్రమమునకు ఔన్నత్యమును కలిగించును. రాజులకు మరణశయ్య ప్రాణములనే రణమనెడి అగ్నియందు అర్పించు ఒక హోమము. రాజులు స్వర్గమును చేరుటకు ఒక వంతెన. అటువంటి యుద్ధమనెడి ఆశ్రమమును మనము చేరుచున్నాము.

(वैरस्य = శత్రుత్వమునకు, आयतनं = స్థానము, बलस्य = శక్తికి, निकषं = గీటురాయి, मानप्रतिष्ठा = గౌరవమనెడి కీర్తికి, गृहं = ఇల్లు, युद्धेषु = యుద్ధములందు, अप्सरसां = అప్సరసలకు, स्वयंवरसभां = స్వయంవర సభ, नृणाम् = మానవులకు, शौर्यप्रतिष्ठां = పరాక్రమమనెడు కీర్తిని (ఇచ్చును), राज्ञां = రాజులకు, पश्चिमकालवीरशयनम् - पश्चिमकाले = మరణ సమయములో, वीरशयनम् = వీరశయ్య, प्राण + अग्निहोमक्रतुम् = ప్రాణములనెడి అగ్నిహోమ క్రతువు, राज्ञां = రాజులకు, నభ: सक्रमम् = స్వర్గమునకు వంతెన, रणसंज्ञं = యుద్ధమనెడు పేరుగల, आश्रमपदं = ఆశ్రమమును, संप्राप्ता: = చేరుచున్నాము.

శత్రుత్వమునకు స్థానమైన, శక్తికి గీటురాయి వంటిదైన ..... అని చెప్పుకొనవలయును.

**द्वितीय:** सम्यग्भवानाह

**ద్వితీయః** సమ్యగ్భవానాహ

**ద్వితీయుడు -** నీవు బాగుగా చెప్పితివి.

उपलविषमा नागेन्द्राणां शरीरधराधरा
दिशिदिशि कृता गृध्रावासा हतातिरथा: रथा: ।
अवनिपतय: स्वर्गं प्राप्ता: क्रियामरणे रणे
प्रतिमुखमिमे तत्तत्कृत्वा चिरं निहताहता: ॥ 5 ॥

ఉపలవిషమా నాగేంద్రాణాం శరీర ధరా ధరా
దిశిదిశి కృతా గృధ్రావాసా హతాతి రథాః రథాః
అవనిపతయః స్వర్గం ప్రాప్తాః క్రియా మరణే రణే
ప్రతిముఖ మిమే తత్త త్కృత్వా చిరం నిహతాహతాః ॥ 5 ॥

ఈ యుద్ధభూమియందు ఒకరితోనొకరు చిరకాలము యుద్ధముచేసి రాజులందరూ గాయపడి స్వర్గములకు పోయిరి. మరణించిన ఏనుగులు ఎగుడుదిగుడులైన రాళ్ళతో నిండిన పర్వతముల వలె ఉన్నవి. రథికులు మరణించిన రథములు రాబందులకు నిలయములగుచున్నవి. ఈ యుద్ధభూమి రాజుల అన్ని పనులను నాశనము చేయుచున్నది.

(उपलविषमा: - उपलै: विषमा: = రాళ్ళతో ఎగుడు దిగుడుగా నున్న, नागेन्द्राणाम् = ఏనుగుల యొక్క, शरीर धराधरा: = శరీరముల వంటి పర్వతములతో, दिशिदिशि = అన్ని దిక్కుల యందు, गृध्र + आवासा: = రాబందులకు నిలయమగుచున్నవి, हत + अतिरथा: हता: अतिरथा: येषान्ते = మరణించిన రథికులు కల, रथा: = రథములు, अवने: पतय: अवनिपतय: =

రాజులు, क्रियामरणे - क्रियया: मरणं यस्मिन् तत् = మరణమనెడి క్రియ, (లేదా क्रिया च मरणं च यस्मिन् तत् = దేనియందు మరణము మరియు క్రియ యుండునో), प्रतिमुखम् = ఒకరితోనాకరు, तत् तत् कृत्वा = ఆయా విధముగా ప్రవర్తించి (అనగా ఆయుధములతో, బాహువులతో యుద్ధము చేసి) (निहताहता: - निहता: च आहता: च = మరణించిరి, గాయపడిరి).

तृतीय: एवमेतत्

తృతీయః ఏవమేతత్

**మూడవవాడు** - ఈ యుద్ధభూమి ఇట్లున్నది.

करिवरकरयूपो बाणविन्यस्तदर्भो

हतगजचयनोच्चो वैरवह्निप्रदीप्त:

ध्वजवितत वितान: सिंहनादोच्चमन्त्र:

पतितपशुमनुष्य: संस्थितोयुद्धयज्ञ:

కరివరకరయూ పో బాణ విన్యస్త దర్భో

హతగజచయనోచ్చో వైరవహ్ని ప్రదీప్తః

ధ్వజ వితత వితానః సింహనాదోచ్చమంత్రః

పతితపశుమనుష్యః సంస్థితో యుద్ధయజ్ఞః

ఏనుగుల తొండములనెడి యూప స్తంభములతో, బాణములనెడి దర్భలతో, మరణించిన ఏనుగులనెడి రాశులతో (పూవులు, పండ్లు మొదలైనవి) ప్రజ్వరిల్లుచున్న శత్రుత్వమనెడు అగ్నితో, వ్యాపించిన శూన్యమనెడు గొడుగుతో, సింహనాదములనెడి మంత్రములతో, మరణించిన మనుష్యులనెడు పశువులతో ఈ యుద్ధభూమి యజ్ఞము వలె ప్రకాశించుచున్నది.

(करिवरकरयूप: - करिवर = శ్రేష్ఠములైన ఏనుగుల యొక్క कर = తొండములనెడు, यूप = యూప స్తంభములతో, बाण-विन्यस्तदर्भ: = ఉంచబడిన బాణములనెడు దర్భలతో, हतगजचयन + उच्च: = మరణించిన ఏనుగులనెడు రాశులతో, वैरवह्निप्रदीप्त: = ప్రకాశించుచున్న శత్రుత్వమనెడు అగ్నితో, ध्वजविततवितान: = వ్యాపించిన శూన్యమనెడు గొడుగుతో, सिंहनाद + उच्चमन्त्र: = సింహనాదములనెడు మంత్రములతో, पतितपशुमनुष्य: = మరణించిన మనుష్యులనెడు పశువులతో, युद्धयज्ञ: = ఈ యుద్ధ యజ్ఞము, संस्थित: = ఉన్నది).

**భావము :** అన్నివిధములా యుద్ధమునకు సిద్ధము చేయబడిన ఈ ఏనుగు, అనేక బాణములు ప్రయోగించుటచే గాయపడి నాశనము చేయబడిన కవచముతో, బాణములతో ధనుస్సుతో రాజుల ఆయుధాగారము వలె కూలుచున్నది.

(प्रसक्तनाराचनिपातपतित: – प्रसक्त = ప్రయోగింపబడిన, नाराच = బాణములచే, निपात = గాయపడి, पतित: = పడిపోవుచున్న, समग्रयुद्ध + उद्यतकल्पित: = అన్ని విధములా యుద్ధమునకు సిద్ధము చేయబడిన, गज: = ఏనుగు, विशीर्णवर्मा – विशीर्णं वर्मा यस्य स: = నాశనము చేయబడిన కవచముతో, सशर: = బాణముతో సహితముగ, सकार्मुक: = ధనుస్సుతో సహితముగ (ఏనుగు పైన ఉన్నది లేక దానిపై పడినది), नृप + आयुधागारम् = రాజుల ఆయుధాగారము, इव = వలె, अवसीदति = కూలుచున్నది)

**तृतीय:** इदमपरं पश्येतां भवन्तौ

**తృతీయః** ఇదమపరం పశ్యేతాం భవన్తౌ

**మూడవవాడు** – ఈ మరియొక దానిని మీరు చూడండి.

माल्यैर्ध्वजाग्रपतितै: कृतमुण्डमालं
    लग्नैकसायकवरं रथिनं विपन्नम्
जामातरं प्रवहणादिव बन्धुनार्यो
    हृष्टा: शिवा रथमुखादवतारयन्ति ॥

మాల్యైర్ధ్వజాగ్రపతితైః కృతముండమాలం
    లగ్నైక సాయకవరం రథినం విపన్నం
జామాతరం ప్రవహణా దివ బంధునార్యో
    హృష్టాః శివా రథము ఖాదవతారయన్తి.

**భావము :** పతాకము (ధ్వజము, జెండా) యొక్క పైభాగము నుండి పడినటువంటి మాలలతో అలంకరింపబడిన శిరస్సు కలిగిన, గొప్పదైన బాణము నాటుకొనుటచే మరణించిన రథికుని, (రథమునందుండి యుద్ధము చేయు సైనికుని) పల్లకిలో నుండి సంతోషముతో అల్లుని దింపుచున్న బంధువులైన స్త్రీల వలె, నక్కలు రథము నుండి (లాగుచున్నవి) దింపుచున్నవి.

(ध्वज + अग्रपतितै: = పతాకము యొక్క పైభాగము నుండి పడిన, माल्यै: = మాలలతో, कृतमुण्डमालं = అలంకరింపబడిన శిరస్సు కలిగిన, (कृता मुण्डमाला येन कृतमुण्डमाला – तं), लग्न + एकसायकवरं = శ్రేష్ఠమైన బాణము నాటుకొనుటచే, विपन्नं = మరణించిన,

रथिनं = రథికుని, हृष्टा: = సంతోషముతోనున్న, शिवा: = నక్కలు, बन्धुनार्य: = బంధువులైన స్త్రీలు, प्रवहणात् = పల్లకిలో నుండి, जामातरं इव = అల్లుని వలె, रथमुखात् = రథము యొక్క పైభాగము నుండి, अवतारयन्ति: = లాగుచున్నవి, దింపుచున్నవి)

**सर्वे** - अहो नु खलु निहतपतितगजतुरगनररुधिर - कलिलभूमिप्रदेशस्य विक्षिप्तवर्मचर्मातपत्र चामरतोमर शर कुन्तकवच कबन्धादि पर्याकुलस्य शक्तिप्रास परशुभिण्डिपालशूल मुसलमुद्गर वराहकर्ण कणय कर्पण शङ्कुत्रासिगदादिभिरायुधैरवकीर्णस्य समन्तपञ्चकस्य प्रतिभयता।

సర్వే - అహో ను ఖలు నిహతపతితగజ తురగ నర రుధిర కలిల భూమిప్రదేశస్య విక్షిప్త వర్మ చర్మాతపత్ర చామర తోమర శర కున్తకవచ కబంధాది పర్యాకులస్య శక్తి ప్రాస పరశు భిండి పాల శూల ముసల ముద్గర వరాహ కర్ణ కణయ కర్పణ శంకు త్రాసి గదాదిభి రాయుధై రవ కీర్ణస్య సమంత పంచకస్య ప్రతిభాయతా.

అందరూ - ఈ యుద్ధభూమిలోపడి మరణించిన ఏనుగులు, గుర్రములు మనుష్యుల నెత్తుటితో తడిసినటువంటి, చెల్లాచెదురుగా పడియున్న కవచములు, డాళ్ళు, గొడుగులు, వింజామరలు, తోమరములు, బాణములు, కుంతములు, కవచములు, మొండెములతో నిండియున్నటువంటి శక్తి, ప్రాస, పరశు (గండ్రగొడ్డలి) భిండిపాల, శూలము, ముసలము, ముద్గరము, వరాహ కర్ణము, కణయము, కర్పణము, శంఖు, త్రాసము, గద మొదలైన ఆయుధ విశేషములతో కూడియున్న ఈ కురుక్షేత్రం ఎంతో భయంకరముగా నున్నది కదా !

(अहो = ఓహో !, नु खलु ! = కదా !, निहत = మరణించిన, पतित = పడియున్న, गज, तुरग, नर = ఏనుగులు, గుర్రములు, మనుష్యులు, रुधिर = నెత్తుటిచే, कलिल = తడిసిన, भूमिप्रदेशस्य = భూమి కలిగిన, विक्षिप्त = వ్యాపించిన, वर्म, चर्म + आतपत्र = కవచములు, చర్మము, గొడుగు, चामर, तामर = వింజామరము, తోమరము, शर = బాణము, कुन्त: = కుంతము (ఈటె), कवच = డాలు, कबन्ध + आदि = మొండెములు మొదలైన వాటితో, पर्याकुलस्य = కూడియున్న, शक्ति, प्रास, परशु, भिण्डिपाल, शूल, मुसल, मुद्गर, वराहकर्ण, कणय, कर्पण, शङ्कु त्रासि, गद + आदिभि: = ఇవన్నియును వివిధములైన ఆయుధ విశేషములుగా చెప్పబడినాయి) మొదలైనవాటితో, अवकीर्णस्य = కూడియున్న, समन्तपञ्चकस्य = ఈ కురుక్షేత్రము, प्रतिभायता = భయంకరము).

**प्रथम:** इदं हि

**ప్రథమః** ఇదం హి

**మొదటివాడు** – ఇది (ఈ భూమియందు)

रुधिरसरितो निस्तीर्यन्ते हतद्विपसंक्रमा

नृपतिरहितैः स्रस्तैः सूतैर्वहन्ति रथान् हयाः।

पतितशिरसः पूर्वाभ्यासाद् द्रवन्ति कबन्धकाः

पुरुषरहिताः मत्ताः नागाः भ्रमन्ति यतस्ततः॥

రుధిరసరితో నిస్తీర్యన్తే హతద్విప సంక్రమా

నృపతి రహితైః స్రస్తైః సూతై ర్వహన్తి రథాన్ హయాః ।

పతిత శిరసః పూర్వాభ్యాసాద్ ద్రవన్తి కబంధకాః

పురుష రహితాః మత్తాః నాగాః భ్రమన్తి యతస్తతః

**భావము** : మరణించి ఏనుగులే వంతెనలుగా నెత్తుటి ప్రవాహము ప్రవహించుచున్నది. రాజులు లేని, మరణించిన రథ సారథులు గల రథములను గుఱ్ఱములు ఈడ్చుకొనిపోవుచున్నవి. తెగిన తలలు గల మొండెములు ఇదివరకటి అభ్యాసముతో పరుగెత్తుచున్నవి. పురుషులు లేని మదించిన ఏనుగులు తమకిష్టమైన రీతిలో సంచరించుచున్నవి.

(हतद्विपसंक्रमा = మరణించిన ఏనుగుల వంతెనలతో, [हताः द्विपाः एव संक्रमाः यासां ताः] रुधिरसरितः = నెత్తుటి ప్రవాహము, रुधिरमेवसरितः ; निस्तीर्यन्ते = వ్యాపించుచున్నది, नृपतिरहितैः = రాజవిహీనములైన (नृपतिभिः रहितैः) स्रस्तैः = పడిపోయిన, सूतैः = రథసారథులు గల, रथान् = రథములను, हयाः = గుఱ్ఱములు, वहन्तिः = లాగుచున్నవి, पतितशिरसः = పడిపోయిన శిరస్సులు గల, कबन्धकाः = మొండెములు, पूर्व + अभ्यासात् = మునుపటి అభ్యాసముతో, द्रवन्ति = పరుగెత్తుచున్నవి, परुषरहिताः = మావటివాడు లేకపోవుటచే, मत्ताः = మదించిన, नागाः = ఏనుగులు, यतः + ततः = ఇటు అటు, भ्रमन्तिः = సంచరించుచున్నవి)

द्वितीय : इदमपरं पश्येतां भवन्तौ । एते

गृध्रा मधूकमुकुलोन्नतपिङ्गलाक्षा
दैत्येन्द्र कुञ्जर नताङ्कुरातीक्ष्ण तुण्डाः ।
भान्त्यम्बरे विततलम्बविकीर्णपक्षा
मांसै प्रवालरचिता इव तालवृन्ताः ॥

ద్వితీయః ఇదమపరం పశ్యేతాం భవన్తౌ । ఏతే

గృధ్రా మధూకముకు లోన్నత పింగలాక్షా
దైత్యేన్ద్ర కుంజర నతాంకుశ తీక్ష తుండాః ।
భాన్త్యంబరే వితతలంబ వికీర్ణపక్షా
మాంసై ప్రవాల రచితా ఇవ తాలవృంతాః ॥ 11 ॥

రెండవవాడు - దీనిని కూడా మీరిద్దరూ చూడుడు.

మధూక పుష్పపు మొగ్గల వలె దట్టమైన ఎర్రని కన్నులతో, రాక్షసరాజు యొక్క ఏనుగును లొంగదీయుటకు ఉపయోగించిన అంకుశము వంటివాడియైన ముక్కులతో, పగడములతో కూడిన వింజామరల వలె వ్యాపింపజేసిన రెక్కలతో, మాంసపు ముద్దలతో యున్న ఈ గ్రద్దలను చూడుము.

[गृध्राः = గ్రద్దలు, मधूक मुकुल + उन्नत पङ्गल + अक्षाः), (मधूकस्य मुकुलाः इव उन्नतानि पिङ्गलानि च अक्षीणि येषां तेः) మధూక పుష్పపు మొగ్గల వలె బాగా ఎర్రనైన కన్నులతోయున్న, दैत्य + इन्द्र कुञ्जर नत + अंकुश तीक्ष्ण तुण्डाः = రాక్షస రాజుయొక్క ఏనుగును లొంగదీయుటకు ఉపయోగించిన అంకుశము వంటి తీక్ష్మైన ముక్కులతో (दैत्येन्द्रस्य कुञ्जरस्य नतः अङ्कुशः इव तीक्ष्णानि तुण्डानि येषां ते) भान्ति + अम्बरे = ఆకాశమునందు ప్రకాశించుచున్నవి, वितत = వ్యాపించిన, लम्ब = వెడల్పుగా, विकीर्णा = వ్యాపించిన, पक्षा = రెక్కలు గల, (विततः लम्बाः विकीर्णाः पक्षाः येषां ते) मासैः = మాంసపు ముద్దలతో, प्रवालरचिताः = పగడములతో కూర్చబడిన, (प्रवालैः रचिताः) तालवृन्ताः इव = తాటాకు విసనకర్రల వలె]

(నెత్తుటితో తడిసిన రెక్కలు, పగడములతో అలంకరింపబడిన విసనకర్రలవలె యున్నవని భావము).

**तृतीय:** - एषा निरस्तहयनागनरेन्द्रयोधा
व्यक्तीकृता दिनकरोग्रकरैः समन्तात्।
नाराचकुन्तशरतोमरखङ्गकीर्णा
तारागणं पतितमुद्वहतीव भूमि: ॥ 12 ॥

ఏషా నిరస్త హయనాగనరేంద్ర యోధా
వ్యక్తీకృతా దినకరోగ్రకరైః సమన్తాత్
నారాచకుంత శరతోమరఖడ్గ కీర్ణా
తారాగణం పతిత ముద్వహతీవ భూమిః ॥ 12 ॥

**భావము :** మరణించిన గుర్రములు ఏనుగులు రాజులు యోధులతో యున్నటువంటి, సూర్యుని ప్రచండ కిరణములతో స్పష్టముగా ప్రకాశించుచున్నటువంటి, ఈటెలు, బల్లెములు, బాణములు తోమరములు ఖడ్గములతో నిండినటువంటి ఈ భూమి పడిపోయిన నక్షత్ర సముదాయమును మోయుచున్నదా యనునట్లున్నది.

[निरस्त = పడిపోయిన, हय = గుర్రములు, नाग = ఏనుగులు, नरेन्द्र = రాజులు, योधा = వీరులు, दिनकर + उग्रकरै: = సూర్యుని తీక్ష్ణకిరణములతో, समन्तात् = అన్ని దిక్కులా, व्यक्तीकृता = వ్యక్తీకరింపబడి (స్పష్టముగా ప్రకాశించుచూ), नाराच कुन्तशरतोमरखङ्गकीर्णा: - नाराचा:, च, कुन्ता: च, शरा: च, तोमरा: च खङ्गा: च तै: अवकीर्णा = అనేకములైన ఆయుధములతో నిండియుండి, पतितं = పడిపోయిన, तारागणं = నక్షత్ర సముదాయములు, उद्वहती = మోయుచున్నదా, इव = వలె, एषा = ఈ, भूमि: = భూమి (ఉన్నది)]

**प्रथम :** - अहो ईदृश्यामप्यवस्थायां अविमुक्तशोभा विराजन्ते क्षत्रिया:। इह हि -
स्रस्तोद्वर्तितनेत्रषट्पदगणा ताम्रोष्ठपत्रोत्करा
भ्रूभेदाञ्चितकेसरा स्वमुकुटव्याविद्धसंवर्तिका।
वीर्यादित्यविबोधिता रणमुखे नाराचनालोन्नता
निष्कम्पा स्थलपद्मिनीव रचिता राज्ञामभीतैर्मुखै:। ॥ 13 ॥

ప్రథమః - అహో ఈదృశ్యామప్యవస్థాయాం అవిముక్త శోభా విరాజన్తే క్షత్రియాః। ఇహ హి
స్రస్తో ద్వర్తిత నేత్ర షట్పదగణా తామ్రోష్ఠపత్రోత్కరా
భ్రూభేదాంచిత కేసరా స్వముకుట వ్యావిద్ధ సంవర్తికా
వీర్యాదిత్య విబోధితా రణముఖే నారాచనాలోన్నతా
నిష్కంపా స్థలపద్మినీవరచితా రాజ్ఞామభీతై ర్ముఖైః। ॥ 13 ॥

**మొదటివాడు :** ఓహో ఇటువంటి స్థితియందు (మరణించు) కూడా రాజులు తమ శోభను కోల్పోవుట లేదు కదా !

**భావము :** భయరహితములైన రాజుల ముఖములు ఈ యుద్ధభూమి యందు చలనము లేని మెట్టతామరలతో నిండిన సరస్సు వలె ప్రకాశించుచున్నవి. పడిపోయిన మరియు కొద్దిగా పైకి వంగినటువంటి కన్నులు తుమ్మెదల వరుసల వలెనూ, ఎర్రని పెదవులు పూలరేకుల వలెనూ, వివిధములైన కనుబొమలు పరాగముల వలెనూ, కిరీటములు కొద్దిగా విచ్చిన చిగురుటాకుల వలె, బాణములనెడి తామరతూడులతోనూ, పరాక్రమమనెడి సూర్యునిచే వికసింపబడిన మెట్టతామరల సరస్సు వలెయున్నారు.

[ अपि + अवस्थायां - अप्यवस्थायां = यणादेशसन्धि: + स्रस्त + उद्वर्तितनेत्रषट्पदगणा - स्रस्त = పడిపోయిన, उद्वर्तित = పైకివంగిన, नेत्र = కన్నులు, षट्पदगणा = తుమ్మెదల వరుసలుగా, नेत्राणि एव षट्पदानां गणा: यस्यां सा, ताम्रोष्ठ पत्रोत्करा = ఎర్రని పెదవులు పూలరేకుల సముదాయములు, ताम्रा: ओष्ठा: एव पत्राणाम् उत्करा: यस्यां सा, भ्रूभेदाञ्चितकेसरा: - भ्रूभेदा: एव अञ्चिता: केसरा: यस्यां सा = వివిధములైన కనుబొమలే పరాగములుగా, स्वमुकुट व्याविद्धसंवर्तिका - स्वमुकुटानि एव व्याविद्धा: संवर्तिका: यस्यां सा - వారి కిరీటములు కొద్దిగా విచ్చిన చిగురుటాకుల గుంపుల వలెనూ, वीर्यादित्यविबोधिता - वीर्य: एव आदित्य: तेन विबोधिता = పరాక్రమమనెడి సూర్యునిచే వికసింపబడి, रणमुखे = యుద్ధభూమి యందు, नाराचनाल + उन्नता = కత్తులే పొడుగైన నాళములుగా, नाराचा: एव नालानि उन्नतानि यस्यां सा ; निष्कम्पा = చలనము లేని, स्थलपद्मिनी = మెట్ట తామరలతో నిండిన సరస్సు, इव = వలె, रचिता = ప్రకాశించుచున్నారు, राज्ञाम् = రాజుల యొక్క, अभीतै: = భయములేని, मुखै: = ముఖములతో ]

**द्वितीय:** - ईदृशानामपि क्षत्रियाणां मृत्यु: प्रभवतीति न शक्यं खलु विषमस्थै पुरुषै: आत्मबलाधानं कर्तुम्।

**ద్వితీయః** - ఈదృశానామపి క్షత్రియాణాం మృత్యుః ప్రభవతీతి న శక్యం ఖలు విషమస్థైః పురుషైః ఆత్మాబలాధానం కర్తుమ్.

**రెండవవాడు** : ఇటువంటి క్షత్రియులకు కూడా మరణము సంభవించుచున్నదనినచో "విపత్కాలమునందు పురుషులు తమ శక్తిని ఉపయోగించుట అసంభవమ" ని తెలియుచున్నది కదా!

(ईदृशानां क्षत्रियाणां = ఇటువంటి క్షత్రియులకు, विषमस्थै: = విపత్కాలమునందు, కష్టకాలమునందు, आत्मनां बलस्य आधानं = తమ యొక్క శక్తిని ఉపయోగించుట)

**तृतीयः** – मृत्युरेव प्रभवति क्षत्रियाणामिति।

**తృతీయః** – మృత్యురేవ ప్రభవతి క్షత్రియాణామితి.

**మూడవవాడు** : మృత్యువొక్కటే క్షత్రియులను వశపరచుకొనగలదు.

[ मृत्युः + एव – मृत्युरेव = మృత్యువు ఒక్కటే, प्रभवति = సామర్థ్యము కలది, వశపరచుకొనగలదు ].

**प्रथमः** – कः संशयः ?

**ప్రథమః** – కః సంశయః ?

**మొదటివాడు** : దానిలో సందేహమేమున్నది.

**द्वितीयः** – मा मा भवानेवम्।

स्पृष्ट्वा खाण्डवधूमरञ्जितगुणं संशप्तकोत्सादनं
सर्गाक्रन्दहरं निवातकवचप्राणोपहरं धनुः।
पार्थेनास्त्रबलान्महेश्वररणक्षेपावशिष्टैः शरै
र्दर्पोत्सिक्तवशा नृपा रणमुखे मृत्योः प्रतिग्रहीताः॥ ॥ 14 ॥

**ద్వితీయః** – మామా భవానేవమ్.

స్పృష్ట్వా ఖాండవధూమ రంజిత గుణం సంశప్తకోత్సాదనం
సర్గాక్రంద హరం నివాత కవచ ప్రాణోపహరం ధనుః।
పార్థే నాస్త్ర బలాన్మహేశ్వర రణక్షేపావశిష్టైః శరై
ర్దర్పోత్సిక్తవశా నృపా రణముఖే మృత్యోః ప్రతిగ్రహీతాః॥ ॥ 14 ॥

రెండవవాడు : కాదు, కాదు. అట్లు పలుకవలదు.

భావము : ఖాండవ వన దహన సమయములో పొగచే మలినమైన వింటినారి కల గాండీవమును స్వీకరించి, సంశప్తకులను సంహరించి, నివాతకవచుల ప్రాణములను స్వీకరించి వారికి స్వర్గమును ప్రాప్తింపజేసిన, మహేశ్వరునితో యుద్ధము చేసినప్పుడు మిగిలిన అర్జునుని అస్త్రములతో గర్వితులైన రాజులందరూ ఈ విధముగా మృత్యువును పొందిరి కదా !

[ खाण्डवधूमरञ्जितगुणं = ఖాండవ వన దహన సమయంలో వచ్చిన ధూమముచే మలినమయిన వింటినారి కలిగిన, संशप्तक + उत्सादनं = సంశప్తకులను అణగదొక్కిన, निवाचकवच – प्राण + उपहारं = నివాతకవచుల ప్రాణములను ఉపహారముగా (బహుకృతిగా) స్వీకరించి, स्वर्ग + आक्रन्द हरं = స్వర్గమును అడ్డముగా నున్న తెరలను ఛేదించిన, धनुः = ధనుస్సును, स्पृष्ट्वा = తాకి, पार्थेन = అర్జునునిచే, महेश्वररणक्षेप + अवशिष्टैः = పరమేశ్వరునితో యుద్ధము చేయునప్పుడు ఉపయోగింపగా మిగిలిన, शरैः = బాణములతో, अस्त्रबलात् = అస్త్రముల బలముచే, दर्पोत्सिक्तवशाः = గర్వముచే కూడుకొనినటువంటి, नृपाः = రాజులు, रणमुखे = యుద్ధభూమియందు, मृत्योः = మృత్యువుచే, प्रतिग्राहिताः = పట్టుకొనబడిరి ].

**सर्वे -** अये शब्दः

**సర్వే -** అయే శబ్దః

किं मेघा निनदन्ति वज्रपतनैः चूर्णीकृताः पर्वताः
निर्घातैस्तुमुलस्वनप्रतिभयैः किं दार्यते वा मही।
किं मुञ्चत्यनिलावधूतचपलक्षुब्धोर्मिमालाकुलं
शब्दं मन्दरकन्दरोदरदरीः संहत्य वा सागरः॥ ॥ 15 ॥
भवतु पश्यामस्तावत्

కిం మేఘా నినదన్తి వజ్రపతనైః చూర్ణీకృతాః పర్వతాః
నిర్ఘాతై స్తుముల స్వనప్రతిభయైః కిం దార్యతే వామహీ
కిం ముంచత్యనిలావధూతచపలక్షుబ్ధోర్మి మాలాకులం
శబ్దం మందర కన్దరోదర దరీః సంహత్య వా సాగరః॥ ॥ 15 ॥
భవతు పశ్యామస్తావత్.

అందరూ : ఓ! భయంకరమైన ధ్వని వినిపించుచున్నది.

భావము : మేఘములు గర్జించుచున్నవా? లేక వజ్రాయుధపు దెబ్బలచే పర్వతములు పొడియగుచున్నవా? భయంకరములైన పిడుగుల వంటి శబ్దములతో భూమి విచ్చుకొని పోవుచున్నదా? లేక మందర పర్వతపు గుహలను తాకిన, గాలిచే కదల్పబడిన తన అలల పరంపరచే సముద్రుడు శబ్దము చేయుచున్నాడా?

కానిమ్ము – చూచెదము.

[ किं = ఏమి, मेघा: = మేఘములు, निनदन्ति = శబ్దము చేయుచున్నవా?, पर्वता: = పర్వతములు, वज्रपतनैः = వజ్రాయుధపు దెబ్బలచే, चूर्णीकृता: = పొడిగా చేయబడుచున్నవా?, तुमुलस्तनप्रतिभयैः = భయంకరములైన మరియు గొప్పవైన శబ్దములచే, मही = భూమి, दार्यते वा किं = విచ్చుకొనిపోవుచున్నదా? मन्दरकन्दरोदारदरी: – मन्दरस्य कन्दरा: – मन्दरकन्दरा:, तासाम् उदरस्य दरी: = మందర పర్వతపు గుహల యొక్క లోపలి భాగములు, कन्दर = గుహల యొక్క, उदर = మధ్యభాగము యొక్క, दरी: = అంచులు, संहत्य: = తాని, अनिलेन = గాలిచే, अवधूत = కదల్పబడి, चपल = చంచలములైన, क्षुब्ध = బాధింపబడిన, ऊर्मिमालाभि: (ऊर्मिणां मालाभि: ) = అలల వరుసలచే, आकुलम् = కల్లోలమైన, सागर: = సముద్రము, शब्दं मुञ्चति किम् = శబ్దము చేయుచున్నదా ఏమి? ]

**प्रथमः** – अये एतत्खलु द्रौपदीकेशघर्षणावमर्षितस्य पाण्डवमध्यमस्य भीमसेनस्य भ्रातृशतवधक्रुद्धस्य महाराजदुर्योधनस्य च द्वैपायनहलायुधकृष्णविदुर-प्रमुखानां कुरुयदुकुलदैवतानां प्रत्यक्षं प्रवृत्तं गदायुद्धम्।

ప్రథమః - అయే ఏతత్఑లు ద్రౌపదీ కేశ ఘర్షణావ మర్షితస్య పాండవ మధ్యమస్య భీమసేనస్య భ్రాతృశతవధక్రుద్ధస్య మహారాజ దుర్యోధనస్య చ ద్వైపాయన హలాయుధ కృష్ణవిదుర ప్రముఖానాం కురు యదుకుల దైవతానాం ప్రత్యక్షం ప్రవృత్తం గదాయుద్ధమ్.

ద్రౌపదీ కేశగ్రహణముచే కోపించిన పాండవ మధ్యముడైన భీమునకు, శత సోదర మరణముతో కోపించిన దుర్యోధన మహారాజునకు మధ్య కురు వంశమునకు, యాదవ వంశమునకు దైవములైన వ్యాసుడు, కృష్ణుడు, బలరాముడు మొదలైనవారి ముందు ప్రత్యక్షముగా జరుగుచున్న గదాయుద్ధమిది.

(द्रौपद्या: केशानां घर्षणेन अवमर्षितस्य = ద్రౌపది కేశ గ్రహణముచే కోపించిన, पाण्डवमध्यम: = భీముడు, भ्रातॄणां शतम्, तस्य वधेन क्रुद्धस्य = సోదర శత మరణముచే కోపించిన, प्रत्यक्षम् = ముందు).

**द्वितीय: -**

भीमस्योरसि चारुकांचनशिलापीने प्रतिस्फालिते
भिन्ने वासवहस्तिहस्तकठिने दुर्योधनांसस्थले।
अन्योन्यस्य भुजद्वयान्तरतटेष्वासज्यमानायुधे
यस्मिश्चण्डगदाभिघातजनित: शब्द: समुत्तिष्ठति ॥ ॥ 16 ॥

ద్వితీయః - భీమస్యోరసి చారుకాంచన శిలాపీనే ప్రతిస్ఫాలితే
భిన్నే వాసవ హస్తిహస్తకఠినే దుర్యోధనాంసస్థలే ।
అన్యోన్యస్య భుజద్వయాంతర తటేష్వాసజ్యమానాయుధే
యస్మిశ్చండ గదాభిఘాత జనితః శబ్దః సముత్తిష్ఠతి॥ ॥ 16 ॥

భావము : అందమైన మరియు బంగారు శిలాఫలకము వంటి భీముని వక్షస్థలముపై తాకినప్పుడును, ఇంద్రుని ఐరావతపు తొండము వలె కఠినమైన దుర్యోధనుని బాహువులపై, తాకినందువలన మరియును, ఒకరి ఆయుధములు మరియొకరి వక్షస్థలమును స్పృశించినందు వల్ల భయంకరమైన గదాఘాతముల వలన శబ్దము కలుగుచున్నది.

[चारु = అందమైన, काञ्चन = బంగారు, शिला = రాతి వలె, पीने = బలిసిన, भीमस्य = భీముని యొక్క, उरसि = వక్షస్థలమునందు, प्रतिस्फालिते = తగిలినప్పుడు, वासव = ఇంద్రుని, हस्ति = ఏనుగు యొక్క, हस्त = తొండము వలె, कठिने = కఠినమైన, दुर्योधन + असंस्थले = దుర్యోధనుని యొక్క బాహువులయందు, भिन्ने = తాకినందు వలన, अन्योन्यस्य = ఒకరిపై మరియొకరు, भुजद्वयात्तरतटेषु = బాహువుల యొక్క మధ్యభాగమైన వక్షస్థలమునందు, आसज्यमान + आयुधे = ఆయుధములు ప్రయోగింపబడినప్పుడు, चण्डगद + अभिघात: = భయంకరమైన గదాభిఘాతముచే, यस्मिन् = యుద్ధభూమియందు, शब्द: = శబ్దము, समुत्तिष्ठति = కలుగుచున్నది]

**तृतीयः** – एष महाराजः

शीर्षोत्कंपनवल्गमानमकुटः क्रोधाग्निकाक्षाननः
स्थानाक्रमणवामनीकृततनुः प्रत्यग्रहस्तोच्छ्रयः।
यस्यैषा रिपुशोणितार्द्रकलिता भात्यग्रहस्ते गदा
कैलासस्य गिरेरिवाग्ररचिता सोल्का महेन्द्राशनिः ॥ 17 ॥

**తృతీయః** – ఏష మహారాజః

శీర్షోత్కంపన వల్గమానమకుటః క్రోధాగ్నికాక్షాననః
స్థానాక్రమణ వామనీకృతతనుః ప్రత్యగ్రహస్తోచ్ఛ్రయః ।
యస్యైషా రిపుశోణి తార్ద్రకలితా భాత్యగ్రహస్తే గదా
కైలాసస్య గిరేరివాగ్ర రచితా సోల్కా మహేంద్రాశనిః ॥ ॥ 17 ॥

**మూడవవాడు** : మహారాజు ఇచ్చటనున్నాడు.

**భావము** : తలను వంచుటచే కొద్దిగా జారిన కిరీటము కలిగిన, కోపమనెడి అగ్నితో మండిపడుచున్న కన్నులు కలిగిన, స్థలమును ఆక్రమించుటకు వంగిన శరీరము కలిగిన, ఒక్కసారిగా చేతిని చాపినటువంటి (మహారాజు ఇదుగో). ఆ చేతియందు శత్రువుల నెత్తుటితో తడిసిన గద కైలాస పర్వతమునందు నిప్పులు కక్కుచున్న ఇంద్రుని వజ్రాయుధము వలె ప్రకాశించుచున్నది.

[शीर्षोत्कम्पनवल्गमानमकुटः – शीर्षस्य उत्कम्पमानेन वल्गमानं मकुटं यस्य सः = శిరస్సును కదలించుటచే కొద్దిగా వంగిన కిరీటముతో, क्रोधाग्निकाक्षाननः – क्रोधः एव अग्निः → क्रोधाग्निः क्रोधाग्निः एव अक्षिः यस्मिन् तत् क्रोधाग्निकाक्षिः – क्रोधाग्निकाक्षिः आननं यस्य सः – क्रोधाग्निकाक्षाननः = కోపమనెడు అగ్నితో నిండిన కన్నులు కలవాడు, स्थानाक्रमणवामनीकृततनुः → स्थानस्य आक्रमणाय वामनीकृता तनुः यस्य सः = స్థానమును ఆక్రమించుటకు కురచగా చేయబడిన శరీరముతో, प्रत्यग्रहस्तोच्छ्रयः – प्रत्यग्रं = ఒక్కసారిగా, हस्त + उच्छ्रयः = చాపిన చేతితో, रिपुशोणितार्दकलिता → रिपूणां शोणितेन आर्द्रा कलिता च = శత్రువుల నెత్తుటిచే తడిసినటువంటి బాగుగా ప్రకాశించుచున్నటువంటి, एषा गदा = ఈ గద, अग्रहस्ते = చేతి పైభాగమునందు, कैलासस्य गिरैः = కైలాస పర్వతము యొక్క, अग्ररचिता: = పైన ప్రకాశించుచున్న, सोल्का = అగ్నితో కూడిన, महेन्द्र + अशनिः = ఇంద్రుని వజ్రాయుధము, इव = వలె, भाति = ప్రకాశించుచున్నది].

**प्रथमः** – एष संप्रहाररुधिरसिक्ताङ्गस्तावददृश्यतां पाण्डवः।

निर्भिन्नाग्रललाटवान्तरुधिरो भग्नांसकूटद्वयः
सान्द्रैर्निर्गलितप्रहाररुधिरैरार्द्रीकृतोरः स्थलः
भीमो याति गदाभिघातरुधिरक्लिन्नावगाढव्रणः
शैलो मेरुरिवैष धातुसलिलासारोपदिग्धोपलः ॥ 18 ॥

ప్రథమ : - ఏష సంప్రహారరుధిరసిక్తాంగస్త్వావద్దృశ్యతాం పాండవః

నిర్భిన్నాగ్ర లలాట వాన్త రుధిరో భగ్నాంసకూటద్వయః ।

సాన్ద్రైర్నిర్గలిత ప్రహార రుధిరై రార్ద్రీకృతోరః స్థలః ।

భీమో యాతి గదాభిఘాత రుధిర క్లిన్నావగాఢవ్రణః

శైలో మేరురివైష ధాతు సలిలాసారోప దిగ్ధోపలః ॥ 18 ॥

మొదటివాడు : గాయముల నుండి కారుచున్న నెత్తుటిచే తడిసిన భీముడిడుగో చూడుము.

పగిలిన నుదుటి నుండి కారుచున్న నెత్తురుతో, పర్వత శిఖరముల వంటి భుజములు విరుగగా, గాయముల నుండి కారుచున్న దట్టమైన నెత్తుటి ప్రవాహముతో తడిసిన వక్షస్థలముతో, గదాభి ఘాతములచే ఏర్పడిన గాయములతో మరియు గడ్డకట్టిన నెత్తుటి భాగములతో భీముడు, గైరికాది ధాతువుల ఎరుపుదనముతో ప్రకాశించుచున్న శిఖరములు గల మేరుపర్వతము వలె ప్రకాశించుచున్నాడు.

[निर्भिन्न + अग्रललाटवान्तरुधिर: → निर्भिन्नं अग्रललाटम् निर्भिन्नाग्रललाटम् तस्मात् वान्तं रुधिरं यस्य स: = పగిలిన నుదిటి పైభాగము నుండి కారుచున్న నెత్తురుతో, भग्नांसकूटद्वय: → भग्नम् अंसकूटस्य द्वयम् यस्य स: – (अंस: कूट: इव – अंसकूट:) = శిఖరముల వంటి భుజములు విరుగగా, सान्द्रै: = దట్టమైన మరియు, निर्गलितप्रहाररुधिरै: → निर्गलितानि च तानि प्रहाररुधिराणि तै: आर्द्रीकृत: उर: स्थल: यस्य स: = గాయముల నుండి ప్రవహించుచున్న నెత్తుటితో తడిసిన వక్షస్థలముతో, गदाया: अभिघाता: → गदाभिघाता: तेषां रुधिरेण क्लिन्नानि अवगाढानि च व्रणानि यस्य स: (क्लिन्न = తడిసిన, अवगाढ = గడ్డకట్టిన) గదాఘాతముచే ఏర్పడిన గాయముల నుండి కారుచున్న మరియు గడ్డకట్టుచున్న నెత్తుటితో, धातुसलिल + आसार + उपदिग्ध + उपल: = గైరికాది ధాతువుల ప్రవాహముచే కూడుకొనిన శిఖరములు గల, मेरु: शैल: इव = మేరుపర్వతము వలె, एष: भीम: भाति = ఈ భీముడు ప్రకాశించుచున్నాడు].

द्वितीय: – भीमां गदां क्षिपति गर्जति वल्गमान:

शीघ्रं भुजं हरति तस्य कृतं भिनत्ति।

चारीं गतिं प्रचरति प्रहरत्यभीक्ष्णं

शिक्षान्वितो नरपतिर्बलवांस्तु भीम: ॥ 19 ॥

ద్వితీయః - భీమాం గదాం క్షిపతి గర్జతి వల్గమానః

శీఘ్రం భుజం హరతి తస్య కృతం భినత్తి ।

చారీం గతిం ప్రచరతి ప్రహరత్యభీక్ష్ణం

శిక్షాన్వితో నరపతిర్బలవాంస్తు భీమః ॥ 19 ॥

రెండవవాడు : అభ్యాసము చేసిన మహారాజు భయంకరమైన గదను భీముని పైకి విసురుచున్నాడు. ముందుకు కదలుచూ గర్జించుచున్నాడు. వేగముగా భుజమును (తన) తప్పించుకొనుచున్నాడు (భీముని గదాఘాతము నుండి). భీముని పనిని (దెబ్బను) ఎదిరించుచున్నాడు. గిర్రున తిరుగుచూ ముందుకు నడుచుచున్నాడు. అనేక మారులు (గదతో) మోదుచున్నాడు. కానీ భీముడు బలవంతుడు.

[शिक्षा + अन्वित: = బాగుగా అభ్యాసము చేసిన, नरपति: = మహారాజైన దుర్యోధనుడు, भीमां = భయంకరమైన, गदां = గదను, क्षिपति = విసరుచున్నాడు, वल्गमान: = ముందుకు కదులుచూ, गर्जति = గర్జించుచున్నాడు, शीघ्रं = వెంటనే, भुजं = భుజమును, हरति = తప్పించుచున్నాడు, तस्य = ఆ భీముని యొక్క, कृतं = పనిని, भिनत्ति = ఎదుర్కొనుచున్నాడు, चारीं गतिं = గిర్రున తిరుగుటయను విధానమును, प्रचरति = ఆచరించుచున్నాడు, अभीक्ष्णं = అనేక మారులు, प्रहरति = మోదుచున్నాడు (గదతో), तु = కానీ, भीम: = భీముడు, बलवान् = బలవంతుడు ]

**तृतीय:** – एष वृकोदर:

शिरसि गुरुनिखातस्रस्तरक्तार्द्रगात्रो
धरणिधरनिकाश: संयुगेष्वप्रमेय: ।
प्रविशति गिरिराजो मेदिनीं वज्रदग्ध:
शिथिलविसृतधातुर्हेमकूटो यथाद्रि: ॥ 20 ॥

**తృతీయః** – ఏష వృకోదరః

శిరసి గురు నిఖాత స్రస్త రక్తార్ద్ర గాత్రో
ధరణీధర నికాశః సంయుగేష్వప్రమేయః ।
ప్రవిశతి గిరిరాజో మేదినీం వజ్ర దగ్ధః
శిథిల విసృత ధాతుర్హేమకూటో యథాద్రిః ॥ 20 ॥

**మూడవవాడు** : ఇదుగో భీముడు.

శిరస్సునందు తగిలిన గొప్ప గాయము నుండి కారుచున్న రక్తముతో తడిసిన శరీరము కలవాడు. పర్వతముతో సమానుడు. యుద్ధమునందు ఎదురులేనివాడు. వజ్రాయుధముచే దహింపబడి శిథిలమై చెల్లాచెదురైన గైరికాది ధాతువులతో కూడిన, పర్వత రాజైన మేరువు వలె నేలకొరుగుచున్నాడు.

(शिरसि = శిరస్సునందు తగిలిన, गुरुनिखातात् स्रस्तेन रक्तेन आर्द्रं गात्रं यस्य स: = గొప్పదైన గాయము నుండి కారుచున్న రక్తముతో తడిసిన శరీరము కలవాడు, धरणिधरस्य निकाश: = పర్వత సమానుడు, संयुगेषु = యుద్ధములందు, अप्रमेय: = ఎదురులేనివాడు, वज्रदग्ध: =

వజ్రాయుధముచే దహింపబడి, शिथिलविसृतधातु: = శిథిలమై చెల్లాచెదురైన ధాతువులతో కూడిన, गिरिराज: పర్వతరాజైన, हेमकूट: अद्रि = మేరు పర్వతము, यथा = ఏ విధముగా, मेदिनीं = భూమిని, प्रविशति = చేరుచున్నదో (అట్లే భీముడు నేలకొరుగుచున్నాడని భావము).

**प्रथम:** – एष गाढप्रहारशिथिलीकृताङ्गं निपतन्तं भीमसेनं दृष्ट्वा
एकाग्रांगुलिधारितोन्नतमुखो व्यास: स्थितो विस्मित:

**ప్రథమః** – ఏష గాఢ ప్రహార శిథిలీకృతాంగం నిపతన్తం భీమసేనం దృష్ట్వా
ఏకాగ్రాంగు లిధారితోన్నత ముఖో వ్యాసః స్థితో విస్మితః.

**మొదటివాడు** : గొప్పవైన గాయములచే క్షీణించిన శరీరముతో పడిపోవుచున్న భీముని చూచి, పైకి ఎత్తబడిన ముఖమునందు తన వ్రేలును ఉంచుకొని వ్యాసుడు ఆశ్చర్యముతో నిలిచిపోయెను.

(गाढप्रहारै: शिथिलीकृतानि अङ्गानि यस्य स: = గొప్పవైన గాయములతో క్షీణించి శరీరావయవములు గల), एका अग्राङ्गुलि: धारिता यस्मिन् तत् = తన అంగులిని ఉంచి, उन्नतं मुखं यस्य स: = పైకి తిప్పబడిన ముఖము కలవాడు)

**द्वितीय:** – दैन्यं याति युधिष्ठिरोऽत्र विदुरो बाष्पाकुलाक्ष: स्थित: ।

**ద్వితీయః** – దైన్యం యాతి యుధిష్ఠిరోఽత్ర విదురో బాష్పాకులాక్షః స్థితః.

**రెండవవాడు** : ఇక్కడ ధర్మరాజు విచారమును పొందుచున్నాడు. విదురుడు కన్నీటితో నిండిన కన్నులతో నిలిచెను.

(बाष्पै: आकुले अक्षिणी यस्य स: = కన్నీటితో నిండిన కన్నులు కలవాడు)

**तृतीय** : – स्पृष्टं गाण्डीवमर्जुनेन गगनं कृष्ण: समुद्वीक्षते।

**తృతీయః** – స్పృష్టం గాండీవమర్జునేన గగనం కృష్ణః సముద్వీక్షతే.

**మూడవవాడు** : అర్జునుడు గాండీవమును స్పృశించుచున్నాడు. కృష్ణుడు ఆకసము వంకకు చూచుచున్నాడు.

**सर्वे** – शिष्यप्रीततया हलं भ्रमयते रामो रणप्रेक्षुक: ॥ 21 ॥

**సర్వే** : శిష్యప్రీతతయా హలం భ్రమయతే రామో రణప్రేక్షుకః

**అందరూ** : ఈ యుద్ధమునందు ప్రేక్షకుడైన బలరాముడు శిష్యునియందభిమానముతో తన హలాయుధమును తిప్పుచున్నాడు.

(शिष्येप्रीतता – शिष्यप्रीतता तया शिष्यप्रीततया = శిష్యుని యందలి ప్రేమతో)

**प्रथम: -** एष महाराज:

वीर्यालयो विविधरत्नविचित्रमौलि

युक्तोऽभिमानविनयद्युतिसाहसैश्च।

वाक्यं वदत्युपहसन्न तु भीम! दीनं

वीरो निहन्ति समरेषु भयं त्यजेति। ॥ 22 ॥

**ప్రథమః -** ఏష మహారాజః

వీర్యాలయో వివిధ రత్న విచిత్రమౌలి

ర్యుక్తోఽభిమాన వినయద్యుతి సాహసైశ్చ।

వాక్యం వదత్యుపహసన్నతు భీమ ! దీనం

వీరో నిహన్తి సమరేషు భయం త్యజేతి ॥ 22 ॥

**మొదటివాడు :** ఇదుగో మహారాజు

**భావము :** పరాక్రమవంతుడు అనేక రత్నములతో నిండిన కిరీటము కలవాడు. అభిమానము, వినయము, కాంతి సాహసము మొదలైనవాటితో నిండిన మహారాజైన దుర్యోధనుడు భీముని చూచి నవ్వుచూ "ఓ భీమా! భయపడకు. వీరుడు దీనుడైన వానిని సంహరింపడు".

(वीर्यालय: वीर्यस्य आलय: = పరాక్రమమునకు నిలయుడు, विविधरत्नविचित्रमौलि: - विविधै: रत्नै: विचित्र: मौलि: यस्य स: = వివిధములైన రత్నములతో అద్భుతమైన కిరీటము కలవాడు, अभिमानविनयद्युतिसाहसै: - अभिमान: च विनय: च द्युति: च साहस: च - तै: .... साहसै: = అభిమానము, వినయము, కాంతి, సాహసములతో, युक्त: = కూడుకొనినవాడు, उपहसन् = నవ్వుచూ, वाक्यं = మాటను, वदति = పలుకుచున్నాడు, भीम = ఓ భీముడా !, भयं = భయమును, त्यज + इति = విడిచిపెట్టుము అని, वीर: = వీరుడు, समरेषु = యుద్ధములందు, दीनं = దీనుని, न निहन्ति = సంహరింపడు, त्यज / त्यजतात् - त्यजताम् - त्यजत = త్యజ ధాతువు మధ్యమ పురుష లోట్)

**द्वितीय :** एष इदानीमपहास्यमानं भीमसेनं दृष्ट्वा स्वमूरू मभिहत्या कामपि संज्ञां प्रयच्छति जनार्दन:।

**ద్వితీయః -** ఏష ఇదానీ మపహాస్యమానం భీమసేనం దృష్ట్వా స్వమూరూమభిహత్య కామపి సంజ్ఞాం ప్రయచ్ఛతి జనార్దనః।

**రెండవవాడు :** అవమానింపబడిన భీముని చూచి శ్రీకృష్ణుడు తన తొడలను కొట్టుకొనుచూ ఏదో సంజ్ఞ చేయుచున్నాడు.

तृतीय: - एष संज्ञया समाश्वासितो मारुति:

संहृत्य भ्रूकुटीर्ललाटविवरे स्वेदं करेणाक्षिपन्

बाहुभ्यां परिगृह्य भीमवदनश्चित्रांगदां स्वां गदाम्

पुत्रं दीनमुदीक्ष्य सर्वगतिना लब्ध्वेव दत्तं बलं

गर्जन् सिंहवृषेक्षण: क्षितितलाद्भूय: समुत्तिष्ठति। ॥ 23 ॥

తృతీయః - ఏష సంజ్ఞయా సమాశ్వాసితో మారుతిః

సంహృత్య భ్రూకుటీర్లలాట వివరే స్వేదం కరేణాక్షిపన్

బాహుభ్యాం పరిగృహ్య భీమవదనశ్చిత్రాంగదాం స్వాం గదామ్ ।

పుత్రం దీనముదీక్ష్య సర్వగతినా లబ్ధ్వేవ దత్తంబలం

గర్జన్ సింహ వృషేక్షణః క్షితితలాద్ భూయః సముత్తిష్ఠతి ॥ ॥ 23 ॥

మూడవవాడు : ఈ సంజ్ఞతో ఆశ్వాసింపబడిన భీముడు

భావము : తన కనుబొమలను ముడిచి, నుదుటియందున్న చెమటను చేతితో తుడుచుకొనుచూ, భయంకరమైన ముఖముతో చిత్రాంగదమను పేరుగల తన గదను చేతిలోనికి తీసికొని, దీనుడైన తన పుత్రునికి వాయుదేవుడిచ్చిన బలమును స్వీకరించినాడా యనునట్లు శ్రేష్ఠమైన సింహమువంటి కన్నులు గల భీముడు భూమిపై నుండి మరల పైకి లేచుచున్నాడు.

(भ्रूकुटी: = కనుబొమలను, संहृत्य = ముడిచి, ललाटविवरे = నుదుటియందున్న, स्वेदं = చెమటను, करेण = చేతితో, अक्षिपन् = తుడుచుచూ, भीमवदन: = భయంకర ముఖము కలిగిన భీముడు, स्वां = తన, चित्राङ्गदा = చిత్రాంగదమను పేరుగల, गदां = గదను, बाहुभ्यां = బాహువులతో, परिगृह्य = తీసుకొని, दीनं पुत्रं = దీనుడైన కుమారుని, उदीक्ष्य = చూచి, सर्वगतिना = వాయుదేవునిచే, दत्तं = ఈయబడిన, बलं = బలమును, लब्ध्वा + इव = స్వీకరించినాడాయనునట్లు, सिंहवृष + ईक्षण: – सिंहवृष: ईक्षणे इव ईक्षण: यस्य स: = శ్రేష్ఠమైన సింహమువంటి కన్నులు కలిగిన భీముడు, गर्जन् = గర్జించుచూ, भूय: = మరల, क्षितितलात् = భూమిపై నుండి, समुत्तिष्ठति = లేచుచున్నాడు)

प्रथम : - हन्त पुन: प्रवृत्तं गदायुद्धम् । अनेन हि

भूमौ पाणितले निघृष्य तरसा बाहू प्रमृज्याधिकं

सन्दष्टोष्ठपुटेन विक्रमबलात् क्रोधिदिकं गर्जता।

त्यक्त्वा धर्मघृणां विहाय समयं कृष्णस्य संज्ञासमं

गन्धारीतनयस्य पाण्डुतनयेनोर्वोर्विमुक्ता गदा ॥ 24 ॥

ప్రథమః - హన్త పునః ప్రవృత్తం గదాయుద్ధమ్ । అనేనహి

భూమౌ పాణితలే నిఘృష్య తరసా బాహూప్రమృజ్యాధికం
సన్దష్టోష్ఠపుటేన విక్రమబలాత్ క్రోధాదికం గర్జతా
త్యక్త్వా ధర్మ ఘృణాం విహాయ సమయం కృష్ణస్య సంజ్ఞాసమం
గాంధారీ తనయస్య పాండుతనయే నోర్వోరీముక్తా గదా ॥ 24 ॥

**మొదటివాడు :** అయ్యో ! మరల గదాయుద్ధము ప్రారంభమైనది. అతడు భూమిని చేతితో తట్టుచూ, బాహువులను మాటిమాటికీ చేతితో చరచుచూ, పెదవిని కొరుకుచూ, గొప్ప కోపముతో గర్జించుచూ, ధర్మయుతమైన దయను విడిచి, కృష్ణుడు చేసిన సంజ్ఞను స్మరించి, పాండు తనయుడైన భీముడు, గాంధారీ పుత్రుడైన దుర్యోధనుని తొడలపై గదను ప్రయోగించెను.

( भूमौ = భూమియందు, पाणितले - पाण्यो: तले = చేతితో (అరచేతితో), निघृष्य = చరచుచూ, तरसा = వెంటనే, बाहू = బాహువులను, अधिकं = ఎక్కువగా, प्रमृज्य = చరచుచూ, ओष्ठपुटेन = పెదవులను, सन्दष्ट = కొరుకుచూ, विक्रमबलात् = గొప్పదైన శక్తి, क्रोधादिकं = అధికమైన కోపముతో, गर्जता = గర్జించుచూ, धर्मघृणां = ధర్మయుతమైన దయను, त्यक्त्वा = విడిచిపెట్టి, समयं = యుద్ధ నియమములను, विहाय = వదిలిపెట్టి, कृष्णस्य = కృష్ణుని, संज्ञासम = సంజ్ఞను స్మరించుకొని, पाण्डुतनयेन = పాండు కుమారుడైన భీమునిచే, गान्धारीतनयस्य = గాంధారీ పుత్రుడైన దుర్యోధనుని, उर्वो: = తొడలపై, गदा = గద, विमुक्ता = ప్రయోగింపబడినది)

**सर्वे** : हा धिक् पतितो महाराज: ।

సర్వే : హా ధిక్ పతితో మహారాజః

అందరూ : అయ్యో మహారాజు పడిపోయినాడు.

**तृतीय** : - एष रुधिरपतनद्योतिताङ्गं निपतन्तंकुरुराजं दृष्ट्वा
खमुत्पतितो भगवान् द्वैपायन: । य एष: -
मालासंवृतलोचनेन हलिना नेत्रोपरोध: कृतो
दृष्ट्वा क्रोधनिमीलितं हलधरं दुर्योधनापेक्षया ।
संभ्रान्तै: करपञ्जरान्तरगतो द्वैपायनज्ञापितो
भीम: कृष्णभुजावलम्बितगतिर्निर्वाह्यते पाण्डवै: ॥ 25 ॥

**తృతీయః** - ఏష రుధిర పతన ద్యోతి తాంగం నిపతన్తం కురురాజం దృష్ట్వా
ఖం + ఉత్పతితో భగవాన్ ద్వైపాయనః । య ఏషః -
మాలాసంవృత లోచనేను హలినా నేత్రోపరోధః కృతో
దృష్ట్వా క్రోధ నిమీలితం హలధరం దుర్యోధన + అపేక్షయా
సంభ్రాన్తైః కరపంజరాంతరగతో ద్వైపాయన జ్ఞాపితో
భీమః కృష్ణ భుజావలంబిత గతిర్ని ర్వాహ్యతే పాండవైః ॥ 25 ॥

**మూదవవాడు :** నెత్తురుపడుటచే ప్రకాశించుచున్న శరీరముగల కురురాజును చూచి వ్యాసభగవానుడు అకాశములోనికి ఎగిరెను.

**భావము :** తన శిష్యుడైన దుర్యోధనునియందలి ప్రేమతో బలరాముడు, పూలదండలచే కప్పపడిన తన కన్నులను ఒక క్షణకాలము మూసికొనగా, వ్యాసుని ఆజ్ఞానుసారము పాండవులు, తమ చేతులతో శ్రీకృష్ణుని సహాయముతో భీముని తీసుకొనివెళ్ళిరి.

[ रुधिरपतनद्योतिताङ्गं - रुधिरस्य पतनेन द्योतितं अङ्गं यस्य सः = నెత్తురు పడుటచే ప్రకాశించుచున్న శరీరము కలవాడు, कुरूणां राजा कुरुराजः = కౌరవుల రాజు, खं = అకాశములోనికి, उत्पतित = చేరుకొనెను (ఎగిరెను) ]

( मालासंवृतलोचनेन = మాలలచే కప్పబడిన కన్నులచే, हलिना = బలరామునిచే, नेत्र + उपरोधः कृतः = మూసికొనెను, दुर्योधन + अपेक्षया = దుర్యోధనుని యందలి అభిమానముచే, क्रोधनिमीलितं = కోపముతో కన్నులను మూసికొనిన, हलधरं = బలరాముని, दृष्ट्वा = చూచి, द्वैपायनज्ञापितः = వ్యాసుని సూచననుసరించి, सम्भ्रान्तैः = తొందరగా, पाण्डवैः = పాండవులచే, करपञ्जरगतः = చేతులనెడి పంజరమునందు, कृष्णभुजावलम्बितगति = కృష్ణుని భుజములను ఆధారముగా చేసుకొనిన, भीमः = భీముడు, निर्वाह्यते = తీసుకొనిపోబడినాడు)

( द्वैपायनेन ज्ञापितः - द्वैपायनज्ञापितः ; हलस्य धरः - हलधरः, दुर्योधनस्य अपेक्षया दुर्योधनापेक्षया ; क्रोधेन निमीलितम् - क्रोधनिमीलितम् ; करपञ्जरान्त-रगतः - करपञ्जरस्य अन्तरगतः ; कृष्णा भुजाव-लम्बितगतिः - कृष्णस्य भुजाभ्याम् अवलम्बिता गतिः यस्य सः)

**प्रथम :** - अये अयमप्यमर्षोन्मीलितरभसलोचनो
भीमसेनापक्रमणमुद्वीक्ष्यमाणः इत एवाभिवर्तते
भगवान् हलायुधः । य एषः
चलविलुलितमौलिः क्रोधताम्रायताक्षो
भ्रमरमुखविदष्टां किञ्चिदुत्कृष्यमालाम् ।
असिततनुविलम्बिस्रस्तवस्त्रानुकर्षी
क्षितितलमवतीर्णः परिवेषीव चन्द्रः ॥ 26 ॥

ప్రథమః - అయే అయమప్యమర్షోన్మీలిత రభసలోచనో భీమసేనా
పక్రమణ ముద్వీక్ష్యమాణః ఇత ఏవాభివర్తతే భగవాన్ హలాయుధః । య ఏషః
చలవిలులితమౌలిః క్రోధతామ్రాయతాక్షో
భ్రమరముఖవిదష్టాం కించి దుత్కృష్యమాలామ్ ।
అసితతనువిలంబి స్రస్త వస్త్రాను కర్షీ
క్షితితలమవతీర్ణః పరివేషీవ చంద్రః ॥ 26 ॥

**మొదటివాడు :** కోపముతో వేగముగా కదులుచున్న కన్నులను తెరచి, భీమసేనుడు తీసికొని పోబడుటను గమనించి భగవానుడైన బలరాముడు ఇటే వచ్చుచున్నాడు అతడు.

**భావము :** కదులుచున్న మరియు చంచలమైన కిరీటము కలవాడు. కోపముతో ఎర్రబడిన మరియు విశాలమైన కన్నులు కలవాడు. తుమ్మెదలచే ఆస్వాదింపబడిన పూవులు గల దండను పక్కకు తప్పించుచూ, వలయముతో కూడిన చంద్రుడు భూమికి చేరినట్లుగా నల్లని శరీరము నుండి జారుచున్న వస్త్రమును పట్టుకొని బలరాముడు ఇటే వచ్చుచున్నాడు.

( अमर्षेण उन्मीलिते रभसे लोचने यस्य सः – अमर्षोन्मीलितरभसलोचनः, अमर्ष = కోపముతో, उन्मीलित = తెరువబడిన, रभस = క్రూరమైన, लोचने = కన్నులు, हलायुधः हलम् आयुधम् यस्य सः – चलविलुलितमौलिः = చలించుచున్న మరియు కదులుచున్న కిరీటము కలవాడు, क्रोधताम्र + आयत + अक्षः = కోపముచే ఎర్రనైన విశాలమైన కన్నులు కలవాడు, भ्रमरमुखविदष्टां = తుమ్మెదలచే ఆస్వాదింపబడిన, मालाम् = దండను, किञ्चित् = కొద్దిగా, उत्कृष्य = తప్పించి, परिवेषी चन्द्रः = వలయముతో కూడిన చంద్రుడు, क्षितितलं = భూమిని, अवतीर्णः इव = చేరినదాయనునట్లున్న, असित तनु – विलम्बिस्रस्तवस्त्र + अनुकर्षी = నల్లని శరీరము నుండి జారుచున్న వస్త్రమును పట్టుకొని)

**द्वितीयः** – तदागम्यतां वयमपि तावन्महाराजस्य प्रत्यनन्तरीभवामः ।

**ద్వితీయః** – తదాగమ్యతాం వయమపి తావన్మహారాజస్య ప్రత్యనన్తరీభవామః.

**రెండవవాడు :** అయినచో రా. మనము కూడా మహారాజు వద్దకు పోయెదము.

(आगम्यताम् - आगम्येताम् - आगम्यन्ताम् ; महान् च असौ राजा च - महाराजः - अनन्तरीभवामः = సమీపమునకు వెళ్ళుట)

निष्क्रान्ताः निష్క్రాన్తాః

అందరూ నిష్క్రమించెదరు.

विष्कम्भकः ఇది విష్కంభకము.

(విష్కంభకము – సామాన్యముగా అంకముల మధ్య ప్రయోగింపబడునది. నీచ పాత్రలచే జరిగిన సన్నివేశములను దీనియందు తెలియజేయబడును. ముఖ్యముగా రంగస్థలముపై ప్రయోగించుటకు శక్యము కాని వానిని నీచ పాత్రలచే చెప్పించబడుచుండును. ఇచ్చట యుద్ధము రంగస్థలముపై ప్రయోగింపబడుటకు అసంభవము. అందువలన దానిని నీచ పాత్రలచే కవి వర్ణించెను).

ततः प्रविशति बलदेवः

**తతః ప్రవిశతి బలదేవః**

**(అప్పుడు బలరాముడు ప్రవేశించుచున్నాడు)**

**बलदेवः** - भोः भोः पार्थिवाः। न युक्तमिदम्
मम रिपुबलकालं लाङ्गलं लङ्घयित्वा
रणकृतमतिसंधिं मां च नावेक्ष्य दर्पात्।
रणशिरसि गदां तां तेन दुर्योधनोर्वोः
कुलविनयसमृध्या पातितः पातयित्वा ॥ 27 ॥

**బలదేవః** - భోః భోః పార్థివాః। నయుక్తమిదమ్
మమ రిపుబలకాలం లాంగలం లంఘయిత్వా
రణకృత మతిసంధిం మాంచ నావేక్ష్య దర్పాత్
రణశిరసి గదాం తాం తేన దుర్యోధనోర్వోః
కులవినయ సమృద్ధ్యా పాతితః పాతయిత్వా ॥ 27 ॥

**బలరాముడు :** ఓ రాజులారా ! ఇది సరియైనది కాదు.

**భావము :** శత్రువుల పాలిటి మృత్యురూపమైన నా హలాయుధమును అవమానించి, యుద్ధనియమము పాటించు నన్ను గర్వముతో గుర్తింపక, యుద్ధభూమిలో దుర్యోధనుని తొడలపై గదను ప్రయోగించి వినయసంపదతో కులమునందు ప్రకాశించువానిని పడగొట్టినాడు కదా !

[मम = నా, रिपुबलकालं = శత్రువుల బలమునకు మృత్యువైన, लाङ्गलं = హలాయుధమును, लङ्घयित्वा = అతిక్రమించి, रणकृतं = యుద్ధమునందు చేసిన, अतिसन्धिं = గొప్ప నియమమును పాటించు, मां = నన్ను, दर्पात् = గర్వముతో, न + अवेक्ष्य = గుర్తింపక, रणशिरसि = యుద్ధభూమిలో, तेन = ఆ భీమునిచే, दुर्योधन + उर्वोः = దుర్యోధనుని తొడలపై, तां गदां = ఆ గదను, पातयित्वा = మోది, कुलविनयसमृध्या = వంశమునందు వినయసంపదతో కూడిన దుర్యోధనుడు, पातितः = పడగొట్టబడెను. ]

भो दुर्योधन! मुहूर्तं तावदात्मा धार्यताम्।
सौभोच्छिष्टमुखं महासुरपुरप्राकारकूटाङ्कुशं
कालिन्दीजलदेशिकं रिपुबलप्राणोपहारार्चितम्।
हस्तोक्षिप्तहलं करोमि रुधिरस्वेदार्द्रपंकोत्तरं
भीमस्योरसि यावदद्य विपुले केदारमार्गाकुलम् ॥ 28 ॥

భో దుర్యోధన! ముహూర్తం తావదాత్మా ధార్యతామ్
సౌభోచ్ఛిష్టముఖం మహాసురపురప్రాకారకూటాంకుశం
కాళిన్దీజలదేశికం రిపుబలప్రాణ + ఉపహార + అర్చితమ్
హస్తోక్షిప్తహలం కరోమి రుధిరస్వేద + ఆర్ద్రపంకోత్తరం
భీమస్యోరసి యావదద్య విపులే కేదారమార్గ + ఆకులమ్ ॥ 28 ॥

ఓ దుర్యోధనుడా ! ఒక్క క్షణము నిన్ను నీవు నిగ్రహపరచుకొనుము.

**భావము :** సౌభాపురము వలె మిగిలిన ముఖముతో ప్రకాశించుచున్న గొప్ప రాక్షసుడైన సాళ్వుని పురప్రాకారములకు అంకుశమువంటిదైన, కాళిందీ జలమును నిర్దేశించిన ; శత్రువుల ప్రాణములను కానుకగా అర్పించి సేవింపబడిన, నా హలాయుధమును నెత్తుటిచే మరియు చెమటతో తడిసిన విశాలమైన భీముని వక్షస్థలముపై ప్రయోగించి పంటపొలమును దున్నుటయందు ఆసక్తి కలిగినదానివలె చేయుదును.

[ सौभ + उच्छिष्टमुखं = సౌభము వలె మిగిలిన ముఖము వలెయున్న (సౌభ అనునది బలరామునిచే నాశనము చేయబడిన పురము), सौभस्य उच्छिष्टं एव मुखं यस्य तत् - महासुर - पुरप्राकारकूट + अङ्कुशं = మహారాక్షసుని పురప్రాకారములకు అంకుశమువంటిదైన (మహారాక్షసుడని సాల్వుని కవి నిర్దేశించుచున్నాడు. ఆతనిని బలరాముడు సంహరించినాడు), कालिन्दीजलदेशिकं = కాళిందీ జలమును నిర్దేశించినటువంటి (బలరాముడు తన నాగలితో కాళిందీ ప్రవాహమును నిర్దేశించినాడు), कालिन्द्याः जलानां देशिकः - रिपुबलप्राण + उपहार + अर्चितम् = శత్రువుల బలమును కానుకగా స్వీకరించినటువంటి, रिपूणां बलस्य प्राणा एव उपहाराः तेन अर्चितम् ; हस्त + उत्क्षिप्त हलं = చేతితో విసరబడిన హలాయుధమును, अद्य = ఈ రోజు, विपुले = విశాలమైన, भीमस्य + उरसि = భీముని యొక్క వక్షస్థలమునందు, केदारमार्ग + आकुलम् = పంటపొలముల యందు ఆ కులమైనదానినిగా, रुधिरस्वेद + आर्द्रपंकोत्तरं = రుధిరముతో, చెమటతో తడిసిన బురద కలిగినదానిని, करोमि = చేయుదును. ]

**नेपथ्ये - నేపథ్యే**

(తెర వెనుక నుండి)

प्रसीदतु प्रसीदतु भगवान् हलायुध ॥

ప్రసీదతు ప్రసీదతు భగవాన్ హలాయుధ.

స్వామీ ! బలరామా ! శాంతించండి, శాంతించండి.

**बलदेवः** - अये एवंगतोऽप्यनुगच्छति मां तपस्वी दुर्योधनः ।
य एषः -
श्रीमान् संयुगचन्दनेन रुधिरेणार्द्रानुलिप्तच्छवि-
भूसंसर्पणरेणुपाटलभुजो बालव्रतं ग्राहितः ।
निवृत्तेऽमृतमन्थने क्षितिधरान्मुक्तः सुरैः सासुरै
राकर्षन्निव भोगमर्णवजले श्रान्तोज्झितो वासुकिः ॥29 ॥

**బలదేవ:** - అయే ఏవంగతోఽప్యనుగచ్ఛతి మాం తపస్వీ దుర్యోధనః ।
య ఏషః -
శ్రీమాన్ సంయుగచందనేన రుధిరేణార్ద్రానులిప్తచ్ఛవి
ర్భూసంసర్పణరేణుపాటలభుజో బాలవ్రతం గ్రాహితః ।
నివృత్తేఽ మృతమంథనే క్షితిధరాన్ముక్తః సురైః సాసురై
రాకర్షన్నివ భోగమర్ణవజలే శ్రాన్తోజ్ఝితో వాసుకిః ॥ 29 ॥

బలరాముడు - ఓ ! ఇటువంటి దయనీయ స్థితియందు కూడా నిస్సహాయుడైన దుర్యోధనుడు నన్నే అనుసరించుచున్నాడు. ఇతడు

**భావము :** ఈ తేజోవంతుడు యుద్ధమనెడి చందనముతో అలంకరింపబడి, నెత్తుటితో తడిసి ప్రకాశించుచున్నాడు. భూమియందున్న ధూళి అంటుటచే ధూసర వర్ణము పొందిన భుజములతో, బాలచేష్టలను మరల పొందినట్లున్నాడు. అమృత మంధనము తరువాత దేవదానవులచే మంధర పర్వతము నుండి విడిచిపెట్టబడి, అలసటను పొందిన మరియు సముద్రజలముల నుండి తన పడగలను లాగుకొనుచున్న వాసుకి వలె ప్రకాశించుచున్నాడు.

[ संयुगस्य चन्दनं - संयुगचन्दनं तेन संयुगचन्दनेन = యుద్ధమనెడి చందనముతో, रुधिरेण = నెత్తుటితో, आर्द्रा + अनुलिप्तछवि: - आर्द्रा अनुलिप्ता छवि: यस्य स: = తడిసిన మరియు అలంకరింపబడినవాడు, भू: संसर्पणरेणु पाटलभुज: = భూమిని తాకుటచే అంటిన ధూళితో ధూసర వర్ణమును పొందిన భుజములతో, बालव्रतं = బాలచేష్టలను, ग्राहित: = పొందినవాడు, अमृतमन्थने निवृत्ते = అమృత మధన సమయము ముగిసిన తరువాత, क्षितिधरात् = పర్వతము నుండి, सुरै: + असुरै: = దేవదానవులచే, श्रान्त: + उज्झित: = అలసటను పొందిన మరియు విడిచిపెట్టబడిన, अर्णवस्य जले = సముద్రజలముల నుండి, भोगम् = పడగను, आकर्षन् = లాగుకొనుచున్న, वासुकि: इव = వాసుకి వలె ప్రకాశించుచున్నాడు. ]

तत: प्रविशति भग्नोरुयुगलो दुर्योधन:

**दुर्योधन:** - एष भो:

भीमेन भित्वा समयव्यवस्थां
गदाभिघातक्षतजर्जरोरु: ।
भूमौ भुजाभ्यां परिकृष्यमाणं
स्वं देहमर्धोपरतं वहामि ॥ 30 ॥

प्रसीदतु प्रसीदतु भगवान् हलायुध:
त्वत्पादयोर्निपतितं पतितस्य भूमा -
वेतच्छिर: प्रथममद्य विमुञ्च रोषम्।
जीवन्तु ते कुरुकुलस्य निवापमोघा:
वैरं च विग्रहकथाश्च वयं नष्टा: ॥ 31 ॥

తతః ప్రవిషతి భగ్నోరుయుగలో దుర్యోధనః

దుర్యోధనః - ఏష భోః

భీమేన భిత్వా సమయ వ్యవస్థాం
గదాభిఘాతక్షతజర్జరోరుః ।
భూమౌభుజాభ్యాం పరికృష్యమాణం
స్వం దేహమర్ధోపరతం వహామి ॥ 30 ॥

ప్రసీదతు ప్రసీదతు భగవాన్ హలాయుధః
త్వత్పాదయోర్నిపతితం పతితస్య భూమా -
వేతచ్ఛిరః ప్రథమమద్య విముంచ రోషమ్।
జీవన్తు తే కురుకులస్య నివాపమోఘాః
వైరం చ విగ్రహకథాశ్చ వయం నష్టాః ॥ 31 ॥

దుర్యోధనుడు - ఓయీ !

భావము : భీమునిచే యుద్ధ నియమములను అతిక్రమించి, ఆతనిచే చేయబడిన గదాభిఘాతములచే నాశనము కాబడిన, గాయము కాబడిన ఊరువులు కలవాడనైతిని. భూమిపై భుజములచే ఈడ్చుకొనుచున్న శరీరముతో సగము చచ్చిన శరీరము కలవాడనైతిని.

ఓ బలరామా ! శాంతించండి. శాంతించండి.

భావము : ఈ భూమిపై పడిన శరీరము మీ పాదముల వద్దకు చేరినది. మొదటగా మీరు కోపమును విడిచిపెట్టండి. కురుకులమునకు నివాపమేఘముల వంటి ఆ పాండు పుత్రులు జీవించును గాక ! శత్రుత్వము, వైర కథలతో మేమే నష్టపోతిమి.

[ समयव्यवस्थां = యుద్ధ నియమములను, भीमेन = భీమునిచే, भित्वा = అతిక్రమించి, गदाभिघातक्षतजर्जर + ऊरु: → गदाया: अभिघातै: क्षतौ जर्जरौ ऊरु यस्य स: = గదాభిఘాతములచే గాయబడిన నాశనము చేయబడిన తొడలు కలవాడు, भुजाभ्यां = భుజములచే, परिकृष्यमाणं = పరిగ్రహింపబడిన, भूमौ = భూమియందు, अध + उपहतं = సగము చచ్చిన, स्वं देहं = నా శరీరమును, वहामि = ధరించుచున్నాను. ]

[ भूमौ = భూమియందు, पतितस्य = పడినటువంటి, एतत् + शिर: = ఈ శిరస్సు, त्वत् + पादयो: = నీ పాదములను, निपतितं = చేరినది, प्रथमं = మొదటగా, अद्य = నేడు, कोपं = కోపమును, निमुञ्च = విడిచిపెట్టుము, कुरुकुलस्य = కురుకులమునకు, निवापमेघा: = పితరులకు నువ్వులు మొదలైనవాటితో జలతర్పణములను విడుచు, ते = ఆ పాండవులు, जीवन्तु = జీవించు గాక !, वैरं = శత్రుత్వము, विग्रहकथा: = వైర కథలు, वयं = మేము, नष्टा: = నశించితిమి. ]

भूमौ + एतत् + शिर: = भूमावेतच्छिर:

बलदेव: - भो: दुर्योधन, मुहूर्तं तावदात्मा धार्यताम्।

బలదేవః - భోః దుర్యోధన ముహూర్తం తావదాత్మా ధార్యతామ్.

బలరాముడు - ఓ దుర్యోధనుడా ! ఒక్క క్షణము నీ ప్రాణములను కాపాడుకొనుము. (నీవు నీ ప్రాణములను కాపాడుకొనుము)

दुर्योधन: - किं भवान् करिष्यति ?

దుర్యోధనః - కిం భవాన్ కరిష్యతి ?

దుర్యోధనుడు - నీవేమి చేయుదువు ?

बलदेव: - भो: श्रूयताम्

आक्षिप्तलाङ्गलमुखोल्लखितै: शरीरै
विदारितांसहृदयान्मुसलप्रहारै: ।
दास्यामि संयुगहतान् सरथाश्वनागान्
स्वर्गानुयात्रपुरुषांस्तव पाण्डुपुत्रान् ॥ 32 ॥

బలదేవః - భోః శృయతామ్

అక్షిప్త లాంగల ముఖోల్లఖితైః శరీరై
విదారితాంస హృదయాన్ముసల ప్రహారైః
దాస్యామి సంయుగ హతాన్ సరథాశ్యనాగాన్
స్వర్గాను యాత్ర పురుషాంస్తవ పాండుపుత్రాన్ ॥ 32 ॥

బలరాముడు - ఓయీ ! వినుము

భావము : హలాయుధము యొక్క అంచుతో శరీరములను చీల్చి, వారి భుజములను, హృదయమును నా ముసలముతో ఛేదించి పాండు కుమారులను రథములు, గుఱ్రములు, ఏనుగులతో సహితముగా నీ స్వర్గ యాత్రకు (తోటి ప్రయాణికులగా) సహచరులుగా చేయుదును.

[आक्षिप्तलाङ्गलमुख + उल्लखितै: → आक्षिप्तस्य लाङ्गलस्य मुखेन उल्लखितै: - విసరబడిన హలాయుధము యొక్క అంచుతో చీల్చబడిన, शरीरै: = శరీరములతో, मुसलप्रहारै: = ముసలము యొక్క దెబ్బలతో, विदारितांसहृदयान् → विदारितानि अंसहृदयानि येषां तात् = ఛేదింపబడిన హృదయములు, భుజములు గల, पाण्डुपुत्रान् = పాండు పుత్రులను, संयुगहतान् = యుద్ధమునందు చంపబడిన, सरथाश्वनागान् = రథములు, గుఱ్రములు, ఏనుగులతో సహితముగా, तव = నీ యొక్క, स्वर्ग + अनुयात्रपुरुषान् = స్వర్గమునకు అనుసరించు పురుషులుగా, दास्यामि = చేయగలను (ఇచ్చెదను), मुसलस्य प्रहारै: - मुसलप्रहारै:; संयुगेहतान् - संयुगहतान् स्वर्गं गन्तुं अनुयात्रा - स्वर्गानुयात्रा, तस्यां पुरुषा: स्वर्गानुयात्र पुरुषा:]

दुर्योधन: - मा मा भवानेवम्।

प्रतिज्ञावसिते भीमे गते भ्रातृशते दिवम् ॥

मयि चैवं गते राम विग्रह: किं करिष्यति ॥ 33 ॥

దుర్యోధనః - మా మా భవానేవమ్.

ప్రతిజ్ఞావసితే భీమే గతే భాతృశతే దివమ్ ।

మయి చైవం గతే రామ విగ్రహః కిం కరిష్యతి ॥ 33 ॥

దుర్యోధనుడు - వలదు, వలదు, నీవట్లు చేయవద్దు.

**భావము :** భీముడు తన ప్రతిజ్ఞను ముగించుకొనినాడు. నూర్గురు సోదరులు స్వర్గమునకు వెళ్ళినారు. నేను ఇటువంటి స్థితిని పొందితిని. ఓ బలరామా ! కలహము వేనిని సాధింపగలదు?

(प्रतिज्ञा अवसिता यस्य स: = ప్రతిజ్ఞను పాటించినవాడు, भ्रातॄणां शतम् – भ्रातृशतम् = నూర్గురు సోదరులు, विग्रह: = యుద్ధము, च + एवं गते = ఈ విధముగా జరుగగా)

बलदेव: - मत्प्रत्यक्षं वञ्चितो भवानित्युत्पन्नो मे रोष:

బలదేవః - మత్ప్రత్యక్షం వంచితో భవానిత్యుత్పన్నో మే రోషః

బలరాముడు - నా ఎదురుగా నీవు మోసగింపబడితివనియే నాకు కోపము.

दुर्योधन: - वञ्चित इति मां भवान् मन्यते

దుర్యోధనః - వంచిత ఇతి మాం భవాన్ మన్యతే.

దుర్యోధనుడు - "నేను మోసగింపబడితిని" అని నీవు తలచుచున్నావా ?

बलदेव: - क: संशय: ?

బలదేవః - కః సంశయః ?

బలరాముడు - అందులో సంశయమేమున్నది ?

दुर्योधन: - हन्त भो: दत्तमूल्या: इव मे प्राणा: कुत: -

अदीप्तान लदारुणाज्जातुगृहात् बुद्ध्यात्मनिर्वाहिणा

युद्धे वैश्रवणालयेऽचलशिलावेगप्रतिस्फलिता।

भीमेनाद्य हिडिम्बराक्षसपति प्राणप्रतिग्राहिणा

यद्येवं समवैषि मां छलजितं भो राम! नाहं जित: ॥ 34 ॥

దుర్యోధనః - హన్త భోః దత్తమూల్యా ఇవమే(ప్రాణాః కుతః
అదీప్తానల దారుగాజ్జాతు గృహాత్ బుద్ధ్యా త్మ నిర్వాహిణా
యుద్ధే వైశ్రవణాలయేऽచలశిలావేగ ప్రతిస్ఫాలినా ।
భీమేనాద్య హిడింబ రాక్షసపతి ప్రాణ ప్రతిగ్రాహిణా
యద్యేవం సమవైషి మాం ఛలజితం భోరామ! నాహం జితః ॥ 34 ॥

దుర్యోధనుడు - అయ్యో ! నా ప్రాణములు మూల్యములుగా చెల్లింపబడినవి.
ఎందువలననగా -

**భావము :** భయంకరమైన అగ్నిజ్వాలలను వెదజల్లు లక్కఇంటి నుండి తెలివితేటలతో తనను తాను కాపాడుకొనినటువంటి, కుబేరునితో యుద్ధము జరుగునపుడు పర్వతములవంటి రాళ్ళను వేగముగా విసిరినటువంటి, రాక్షసపతియైన హిడింబుని ప్రాణములను తీసినటువంటి భీమునిచే, "నేను మోసముగా జయింపబడితిని" అని ఓ బలరామా ! నీవు తలచినచో, నేను నిజముగా జయింపబడలేదు.

[ अदीप्तानलदारुणात् + जातुगृहात् → अदीप्तेन अनलेन दारुणात् जातुगृहात् = భయంకరమైన అగ్నిజ్వాలలను వెదజల్లు లక్కఇంటి నుండి, बुद्ध्या = తన తెలివితేటలతో, आत्मनिर्वाहिणा → आत्मन: निर्वाहिणा = తనను తాను కాపాడుకొనిన, वैश्रवणालये – वैश्रवणस्य आलये = కుబేరుని యొక్క రాజ్యములో, युद्धे = యుద్ధమునందు, अचलशिलावेगप्रतिस्फलिना → अचलशिलानां वेगेन प्रतिस्फलिना = పర్వత సానువులను వేగముగా విసిరినటువంటి, हिडिम्बराक्षसपतिप्राणप्रतिग्राहिणा → हिडिम्ब इति राक्षसपति: तस्य प्राणानां प्रतिग्राहिणा = హిడింబుడను రాక్షసపతి ప్రాణములను స్వీకరించినటువంటి, भीमेन = భీమునిచే, अद्य = నేడు, छलजितं = మోసముతో జయింపబడితిని, इति = అని, मां = నన్ను, समवैषि = తలచినచో, भो राम = ఓ బలరాముడా, अहं = నేను, न जित: = జయింపబడలేదు. ]

बलदेव: - भीमसेन इदानीं तव युद्धवञ्चनामुत्पाद्य स्थास्यति
బలదేవః - భీమసేన ఇదానీం తవ యుద్ధవంచనా ముత్పాద్య స్థాస్యతి
బలరాముడు - నిన్ను యుద్ధమునందు మోసగించిన భీముడు ఇప్పుడు జీవించి యుండగలడా ?

दुर्योधन: - किं चाहं भीमसेन वञ्चित: ?
దుర్యోధనః - కిం చాహం భీమసేన వంచితః?
దుర్యోధనుడు - ఏమీ ? నేను భీమునిచే మోసగింపబడితినా ?

बलदेव: - अथ केन भवानेवंविध: कृत: ?

బలదేవః - అథ కేన భవానేవం విధః కృతః?

బలరాముడు - అయినచో నీవు ఎవరిచే ఇటువంటి స్థితికి తీసికొని రాబడితివి ?

दुर्योधन: - श्रूयताम्

येनेन्द्रस्य स पारिजातकतरुर्मानेन तुल्यं हृतो
दिव्य वर्षसहस्रमर्णवजले सुप्तश्च यो लीलया।
तीव्रां भीमगदां प्रविश्य सहसा निव्योजयुद्धप्रिय -
स्तेनाहं जगत: प्रियेण हरिणा मृत्यो: प्रतिग्राहित: ॥35 ॥

దుర్యోధనః - శ్రూయతామ్

యేనేన్ద్రస్య స పారిజాతకతరుర్మానేన తుల్యం హృతో
దివ్యం వర్షసహస్ర మర్ణవజలే సుప్తశ్చయో లీలయా ।
తీవ్రాం భీమగదాం ప్రవిశ్య సహసా నివ్యాజయుద్ధప్రియ
స్తేనాహం జగతః ప్రియేణ హరిణా మృత్యోః ప్రతిగ్రాహితః ॥ 35॥

దుర్యోధనుడు - వినుము.

**భావము :** ఎవడైతే ఇంద్రుని పారిజాత వృక్షాన్ని అతని గర్వముతో సహితముగా పెకలించినాడో, వేలకొలది దివ్యమైన సంవత్సరములు సముద్రజలములో నిదురించినాడో, ఎవడైతే ధర్మయుద్ధమును కోరుకొనునో అటువంటి లోకప్రియుడైన శ్రీకృష్ణునిచే మృత్యువు ఒక్కసారిగా భయంకరమైన భీముని గదలోనికి ప్రవేశపెట్టబడి నన్ను దానిచే చంపినది.

[ येन = ఎవనిచే, इन्द्रस्य = ఇంద్రుని యొక్క, पारिजातक तरु: = పారిజాత వృక్షము, मानेन तुल्यं = గర్వముతో సహితముగా, हृत: = దొంగిలింపబడినదో, दिव्यं = దివ్యమైన, वर्षसहस्रं = వేల సంవత్సరములు, अर्णवजले = సముద్ర జలమునందు, लीलय = విచిత్రముగా, सुप्त: + च = నిదురించినాడో, जगत: प्रियेण = లోకప్రియుడైనటువంటి, निव्योजयुद्धप्रिय: निव्योज = మోసరహితమైన, युद्धप्रिय: = యుద్ధమునందు ఆసక్తి కలిగినటువంటి, हरिणा = శ్రీకృష్ణునిచే, तीव्रां = భయంకరమైన, भीमगदां = భీముని గదలోనికి, सहसा = వెంటనే, प्रविश्य = ప్రవేశించి, मृत्यो: = ఆ మృత్యువుచే, अहं प्रतिग्राहित: = నేను పట్టుకొనబడితిని. ]

( नेपथ्ये ) (నేపథ్యే)

తెర వెనుక

उत्सरतोत्सरतार्या: ! उत्सरत।

పూజ్యులారా ! తప్పుకోండి. తప్పుకోండి.

**बलदेव:** - (विलोक्य) अये अयमत्रभवान् धृतराष्ट्र:
गान्धारी च दुर्जयेनादेशितमार्गोऽन्त:पुरानुबन्ध:
शोकाभिभूतहृदयश्चकितगतिरित एवाभिवर्तते। य एष:
वीर्याकर: सुतशतप्रविभक्तचक्षु -
दर्पोद्यत: कनकयूपविलम्बबाहु:।
सृष्टो ध्रुवं त्रिदिवरक्षणजातशंकै -
दैवैररातितिमिराञ्जलिताडिताक्ष: ॥ 36 ॥

బలదేవః - (విలోక్య) అయే అయమత్రభవాన్ ధృతరాష్ట్రః
గాంధారీ చ దుర్జయేనాదేశితమార్గోऽంతఃపురాను బంధః
శోకాభిభూతహృదయశ్చకితగతిరిత ఏవాభివర్తతే ! య ఏషః -
వీర్యాకరః సుతశతప్రవిభక్త చక్షు
ర్దర్పోద్యతః కనకయూపవిలంబబాహుః ।
సృష్టో ధృవం త్రిదివరక్షణజాతశంకై -
ర్దైవైరరాతితిమిరాంజలి తాడితాక్షః ॥ 36 ॥

బలరాముడు - (చూచి) అయ్యో !
దుర్జయునిచే మార్గము చూపింపబడుచుండగా, అంతఃపుర స్త్రీలు అనుసరించుచుండగా, కన్నీటితో నిండిన హృదయముతో, తడబడుచున్న అడుగులతో పూజ్యులైన గాంధారీ ధృతరాష్ట్రులు ఇటే వచ్చుచున్నారు. ఇతడు -

**భావము :** ఈతడు పరాక్రమమునకు నిలయుడు. నూర్గురు కుమారులతో వికసించిన కన్నులు కలవాడు. గర్వము కలవాడు. బంగారు యూపస్తంభము వలె పొడుగైన బాహువులు కలవాడు. స్వర్గ రక్షణ యందాసక్తి కలిగిన దేవతలచే శత్రుత్వమనెడి చీకటిచే నింపబడిన కన్నులు కలవాడు.

(దేవతలు స్వర్గమును రక్షించుకొనుటకు ఆతనిని అంధునిగా సృష్టించారు. ఆతడు స్వర్గమును చూసినచో దానిని రక్షించుకొనుట అసంభవమని దేవతలు తలచినారని భావము.)

[वीर्याकर: - वीर्यस्य आकर: = పరాక్రమమునకు నిలయుడు, सुतशतप्रविभक्त चक्षु: → सुतशते प्रविभक्ते चक्षुषी यस्य स: = నూర్గురు కుమారులతో వికసించిన కన్నులు కలవాడు, दर्पोद्यत: - दर्पेण उद्यत: = గర్వముతో కూడుకొనినవాడు, कनकयूपविलम्बबाहु: - कनकयूप इव विलम्बौ बाहू यस्य स: = బంగారు యూపస్తంభము వలె విశాలమైన బాహువులు కలవాడు, त्रिदिवरक्षणजातशंकै: = స్వర్గ రక్షణ యందు ఆసక్తి కలిగిన వారిచే (దేవతలచే), त्रिदिवस्य रक्षणे जाता शङ्का येषां तै: - अरातितिमिर + अञ्जलि ताडित + अक्ष: = శత్రుత్వమనెడి చీకటిచే కొట్టబడిన కన్నులు కలవాడైన, ध्रुवं = నిశ్చయముగా, सृष्ट: = సృష్టింపబడినాడు. ]

(तत: प्रविशति धृतराष्ट्रो गान्धारी देव्यौ दुर्जयश्च)

(తతః ప్రవిశతి ధృతరాష్ట్రో గాంధారీ దేవ్యౌ దుర్జయశ్చ)

(అంతట ధృతరాష్ట్రుడు గాంధారీ, మహారాణులు, దుర్జయుడు ప్రవేశింతురు)

धृतराष्ट्र: - पुत्र क्वासि ?

ధృతరాష్ట్రః - పుత్ర క్వాసి ?

ధృతరాష్ట్రుడు - కుమారా ! ఎక్కడున్నావు ?

गान्धारी - पुत्रक क्वासि ?

గాంధారీ - పుత్రక క్వాసి ?

గాంధారీ - కుమారా ! ఎక్కడున్నావు ?

देव्यौ - महाराज क्वासि ?

దేవ్యౌ - మహారాజ క్వాసి ?

మహారాణులు - మహారాజా !. ఎక్కడున్నావు ?

धृतराष्ट्र: - भो: कष्टम्

वञ्चनानिहतं श्रुत्वा सुतमद्याहवे मम ।
मुखमन्तर्गतास्राक्षमन्धमन्धतरं कृतम् ॥ 37 ॥
गान्धारि किं धरसे ?

ధృతరాష్ట్రః - భోః కష్టమ్

వంచనాని హతం శ్రుత్వా సుతమద్యాహవే మమ ।
ముఖ మన్తర్గతాస్రాక్ష మంధ మంధతరం కృతమ్ ॥ 37 ॥
గాంధారి కిం ధరసే ?

ధృతరాష్ట్రుడు - అయ్యో ఎంత కష్టము.

భావము : ఈ రోజు నా కుమారుడు యుద్ధమునందు మోసముతో చంపబడినాడని తెలుసుకొని, కన్నీటితో నిండిన నా గ్రుడ్డి కన్నులు మరింత అంధత్వమును పొందుచున్నవి.

గాంధారీ ! నీవు భరింపగలుగుచున్నావా ?

[ वञ्चनया निहतं → वञ्चनानिहतं = మోసముచే చంపబడినాడని, श्रुत्वा = విని, सुतं = కుమారుని, अद्य = నేడు, आहवे = యుద్ధమునందు, अन्तर्गतास्राक्षम् अन्तर्गतानि अस्राणि ययो: ते अक्षिणी यस्य तत् = కన్నీటితో నింపబడిన కన్నులు కలిగిన ].

| | | |
|---|---|---|
| **गान्धारी** | - | जीवितास्मि मन्दभागा। |
| **గాంధారీ** | - | జీవితాస్మి మందభాగా |
| **గాంధారి** | - | దురదృష్టవంతురాలనైన నేను జీవించియేయున్నాను. |
| **देव्यौ** | - | (महाराज! महाराज!) |
| **దేవ్యౌ** | - | మహారాజ ! మహారాజ ! |
| **మహారాణులు** | - | మహారాజా ! మహారాజా ! |
| **राजा** | - | भो: ! कष्टम् यन्ममापि स्त्रियो रुदन्ति |
| **రాజా** | - | భోః కష్టమ్. యన్మమాపి స్త్రియో రుదన్తి |
| **రాజు** | - | అయ్యో ఎంత కష్టము. నా కొరకు స్త్రీలు దుఃఖించుచున్నారు. |

पूर्वं न जानामि गदाभिघात
    रुजामिदानीं तु समर्थयामि॥
यन्मे प्रकाशीकृतमूर्धजानि
    रणं प्रविष्टान्यवरोधनानि ॥ 38 ॥

పూర్వం న జానామి గదాభిఘాత
    రుజామిదానీం తు సమర్థయామి.
యన్మే ప్రకాశీకృతమూర్ధజాని
    రణం ప్రవిష్టాన్యవరోధనాని. ॥ 38 ॥

భావము : గదాభిఘాత గాయములు నన్ను పూర్వము బాధించలేదు. కానీ ఇప్పుడు ఆ గాయముల బాధను గుర్తింపగలుగుచున్నాను. తొలగింపబడిన ముసుగులతో అంతఃపురస్త్రీలు యుద్ధభూమిలోనికి ప్రవేశించుచున్నారు.

[ गदा + अभिघातरुजां = గదాఘాతపు గాయములను, पूर्वं = ఇదివరకు, न जानामि = తెలుసుకొన లేకపోతిని, इदानीं तु = ఇప్పుడు, समर्थयामि = గుర్తింపగలిగితిని, प्रकाशीकृतमूर्धजानि – प्रकाशीकृतानि मूर्धजानि यै: तानि = తొలగింపబడిన ముసుగులతో, मे = నా, अवरोधनानि = అంతఃపుర స్త్రీలు, रणं = యుద్ధభూమిని, प्रविष्टानि = ప్రవేశించినారు. ]

धृतराष्ट्रः - गान्धारी किं दृश्यते दुर्योधननामधेयः कुलमानी,

ధృతరాష్ట్రః - గాంధారి, కిం దృశ్యతే దుర్యోధన నామధేయః కులమానీ

ధృతరాష్ట్రుడు - గాంధారి ! దుర్యోధన నామధేయుడైన వంశోన్నతిని కల్గించు (మన కుమారుడు) నీకు కనిపించుచున్నాడా ?

गान्धारी - महाराज ! न दृश्यते

గాంధారీ - మహారాజ ! న దృశ్యతే

గాంధారి - మహారాజా ! కనిపించుట లేదు.

धृतराष्ट्रः - कथं न दृश्यते। हन्त भोः। अद्यास्म्यहमन्धोयोऽहमन्वेष्टव्ये काले पुत्रं न पश्यामि। भोः कृतान्ताहतक !

रिपुसमरविमर्दं मानवीर्यप्रदीप्तं

सुतशतमतिधीरं वीरमुत्पाद्य मानम्

धरणितलविकीर्णं किं स योग्यो न भोक्तुं

सकृदपि धृतराष्ट्रः पुत्रदत्तं निवापम्॥

ధృతరాష్ట్రః - కథం నదృశ్యతే । హన్త భోః । అద్యాస్మ్యహ మన్ధో యోఽహ మన్వేష్టవ్యే కాలే పుత్రం నపశ్యామి! భోః కృతాన్తాహతక

రిపు సమర విమర్దం మానవీర్య ప్రదీప్తం

సుతశతమతిధీరం వీరముత్పాద్య మానమ్ ।

ధరణితల వికీర్ణం కిం స యోగ్యో న భోక్తుం

సకృదపి ధృతరాష్ట్రః పుత్రదత్తం నివాపమ్ ॥

ధృతరాష్ట్రుడు - ఎట్లు కనిపించకుండును. అయ్యో ! అన్వేషింపవలసిన కాలములో కుమారుని చూడలేకపోవుటచే నేడు నిజముగా గుడ్డివాడనైతిని. ఓ మృత్యువా !

**భావము :** యుద్ధమునందు శత్రువులను నాశనము చేయగలిగిన, గర్వముతోనూ పరాక్రమముతోనూ ప్రకాశించుచున్న, భయంకరులైన వందమంది కుమారులకు జన్మనీయగా వారు భూమిపై పడియున్నారు. కుమారుడిచ్చు జలతర్పణములను అనుభవించుటకు ఈ ధృతరాష్ట్రుడు యోగ్యుడు కాదు !

[ रिपुसमरविमर्दं = యుద్ధమునందు శత్రువులను నాశనము చేయగలిగిన, (रिपूणां समरे विमर्दम्) मानवीर्यप्रदीप्तं → मानेन वीर्येण च प्रदीप्तम् = బలపరాక్రమములతో ప్రకాశించు, अतिधीरं = భయంకరమైన, वीरं = వీరులైన, सुतशतं = వందమంది కుమారులను,

उत्पद्य = జన్మనిచ్చి, धरणितल विकीर्ण - धरणितले विकीर्ण = భూమిపై చెల్లాచెదురుగా పడియున్నారు, धृतराष्ट्र: = ధృతరాష్ట్రుడు, पुत्रदत्तं = పుత్రునిచే ఈయబడిన (पुत्रेण दत्त: → तम्) निवापम् = జలతర్పణములను, भोक्तुं = అనుభవించుటకు, योग्य: = యోగ్యుడు, न किम् = కాదా ?]

गान्धारी - जात दुर्योधन ! देहि मे प्रतिवचनम् !
पुत्रशतविनाशदु:खितं समाश्वास्य महाराजम्।

గాంధారీ - జాత దుర్యోధన ! దేహి మే ప్రతివచనమ్.
పుత్ర శత వినాశదుఃఖితం సమాశ్వాసయ మహారాజమ్.

గాంధారి - నాయనా ! దుర్యోధనా ! నాకు సమాధానమిమ్ము. వందమంది కుమారులను పోగొట్టుకొనిన (నీ తండ్రిని) మహారాజును ఓదార్చుము.

बलदेव: - अये इयमत्रभवती गान्धारी
या पुत्रपौत्रवदनेष्वकुतूहलाक्षी
दुर्योधनास्तमितशोकनिपीतधैर्या।
अस्त्रैरजस्रमधुना पतिधर्मचिह्न -
मार्द्रीकृतं नयनबन्धमिदं ददाति ॥ 40 ॥

బలదేవః - అయే ఇయమత్రభవతీ గాంధారీ
యా పుత్ర పౌత్రవదనేష్వకుతూహలాక్షీ
దుర్యోధనాస్తమితశోకనిపీత ధైర్యా ।
అస్త్రైరజస్రమధునా పతిధర్మచిహ్న
మార్ద్రీకృతం నయనబంధమిదం దదాతి ॥ 40 ॥

బలరాముడు - పూజ్యురాలైన గాంధారి ఇదుగో

**భావము :** పుత్రుల, మనుమల ముఖములను చూచుటయందు ఆసక్తి లేనటువంటిది. దుర్యోధనుని మరణముచే ధైర్యము కోల్పోయినటువంటిది. పాతివ్రత్య ధర్మమునకు గుర్తుగా ఆమె ధరించిన నయన బంధము నేడు కన్నీటితో తడిసినది.

[पुत्राश्च पौत्राश्च तेषां वदनेषु - पुत्रपौत्रवदनेषु = కొడుకులు మనుమల ముఖముల యందు, अकुतूहलाक्षी = కుతూహలము చూడలేని కన్నులు కలది. (नास्ति कुतूहलम् अक्षिणो: यस्या: सा) दुर्योधन + अस्तमित शोक निपीतधैर्या = దుర్యోధనుని మరణమనెడి శోకముచే నాశనము చేయబడిన ధైర్యము కలది, पतिधर्मचिह्नं = పాతివ్రత్య ధర్మమునకు గుర్తుగా ధరించిన, नयनबन्धं = నేత్రబంధము, अजस्रं = ఎల్లప్పుడూ ప్రవహించి, अस्रै: = కన్నీటితో, आर्द्रीकृतं ददाति = తడిసినదగుచున్నది. ]

| | | |
|---|---|---|
| धृतराष्ट्रः | - | पुत्र दुर्योधन! अष्टादशाक्षौहिणी महाराज क्वासि ? |
| ధృతరాష్ట్రః | - | పుత్ర దుర్యోధన ! అష్టాదశాక్షౌహిణీ మహారాజ క్వాసి ? |
| ధృతరాష్ట్రుడు | - | పదునెనుమిది అక్షౌహిణులకు మహారాజైన ఓ దుర్యోధనా ! కుమారా! ఎచ్చటున్నావు ? |

(అక్షౌహిణీ సైన్యము 21,870 రథములు, 21,870 ఏనుగులు, 65,610 గుర్రములు, 1,09,350 సైన్యము కలది. దుర్యోధనునకు 18 అక్షౌహిణుల సైన్యము, పాండవులకు 11 అక్షౌహిణుల సైన్యము)

| | | |
|---|---|---|
| राजा | - | अद्यास्मि महाराजः ? |
| రాజా | - | అద్యాస్మి మహారాజః ! |
| రాజు | - | నేడు మహారాజునా ? |
| धृतराष्ट्रः | - | एहि पुत्रशतज्येष्ठ देहि मे प्रतिवचनम्। |
| ధృతరాష్ట్రః | - | ఏహి పుత్రశతజ్యేష్ఠ దేహి మే ప్రతివచనమ్. |
| ధృతరాష్ట్రుడు | - | వందమంది కుమారులలో జ్యేష్ఠుడా ! దుర్యోధనా ! నాకు సమాధానమిమ్ము. |
| राजा | - | ददामि खलु प्रतिवचनम्। अनेन वृत्तान्तेन व्रीलितोऽस्मि। |
| రాజా | - | దదామి ఖలు ప్రతివచనమ్. అనేన వృత్తాన్తేన వ్రీలితోऽస్మి |
| రాజు | - | సమాధానమిచ్చుచుంటిని కదా ! ఈ జరిగిన పనికి చాలా సిగ్గుపడుచున్నాను. |
| धृतराष्ट्रः | - | एहि पुत्र! अभिवादयस्व माम्। |
| ధృతరాష్ట్రః | - | ఏహి పుత్ర ! అభివాదయస్వ మామ్ ! |
| ధృతరాష్ట్రుడు | - | కుమారా ! ఇటు రమ్ము. నాకు నమస్కరింపుము. |
| राजा | - | अयमयमागच्छामि (उत्थानं रूपयित्वा पतति) हा धिक्।<br>अयं मे द्वितीयः प्रहारः। कष्टं भोः<br>हृतं मे भीमसेनेन गदापातकचग्रहे।<br>सममूरुद्वयेनाद्य गुरोः पादाभिवन्दनम् ॥ 41 ॥ |
| రాజా | - | అయమయమాగచ్ఛామి (ఉత్థానం రూపయిత్వా పతతి) హా ధిక్<br>అయం మే ద్వితీయః ప్రహారః ! కష్టం భోః<br>హృతం మే భీమసేనేన గదాపాతకచగ్రహే ।<br>సమమూరుద్వయేనాద్య గురోః పాదాభివందనమ్ ॥ 41 ॥ |
| రాజు | - | ఇదిగో వచ్చుచున్నాను (లేచినట్లు, పడిపోవుచున్నట్లు నటించుచూ) అయ్యో ! ఇది నాకు రెండవ గాయము. ఎంత కష్టము. |

భావము : భీమసేనునిచే జుట్టుపట్టుకొని గదాభిఘాతము చేసినప్పుడు, నా ఊరుద్వయముతో పాటు పెద్దలకు నమస్కారము చేయుట (శక్తి) కూడా హరింపబడినది.

[ भीमसेनेन = భీమునిచే, गदापातकचग्रहे = గదాభిఘాతముతో జుట్టు పట్టుకొని, मे ऊरुद्वयेन समं = నా ఊరుద్వయముతోపాటు, गुरो: = పెద్దలకు, पादाभिवन्दनम् = పెద్దలకు నమస్కరించుట, हृतं = దొంగిలింపబడింది, पादयो: अभिवन्दनम् ]

| | | |
|---|---|---|
| **गान्धारी** | - | अत्र जाते |
| **గాంధారీ** | - | అత్ర జాతే |
| **గాంధారి** | - | కుమారా ! ఇక్కడ .... |
| **देव्यौ** | - | आर्ये इमे स्व: |
| **దేవ్యౌ** | - | ఆర్యే ఇమే స్వః |
| **రాణులు** | - | స్వామీ ఇక్కడ ఉన్నాము. |
| **गान्धारी** | - | अन्वेषेथां भर्तारम् |
| **గాంధారీ** | - | అన్వేషేథాం భర్తారమ్. |
| **గాంధారి** | - | భర్తను అన్వేషించండి. |
| **देव्यौ** | - | गच्छाव: मन्दभागे |
| **దేవ్యౌ** | - | గచ్ఛావః మందభాగే |
| **రాణులు** | - | దురదృష్టవంతులమైన మేము వెళ్ళెదము. |
| **धृतराष्ट्र:** | - | क एष भो: । मम वस्त्रान्तमाकर्षन् मार्गमादेशयति । |
| **ధృతరాష్ట్రః** | - | క ఏష భోః మమ వస్త్రాన్తమాకర్షన్ మార్గమాదేశయతి. |
| **ధృతరాష్ట్రుడు** | - | ఎవరది. నా వస్త్రమును లాగుచూ దారిచూపించుచున్నాడు. |
| **दुर्जय:** | - | तात! अहं दुर्जय: |
| **దుర్జయః** | - | తాత ! అహం దుర్జయః |
| **దుర్జయుడు** | - | తాత ! నేను దుర్జయుడను |
| **धृतराष्ट्र:** | - | पौत्र दुर्जय ! पितरमन्विच्छ। |
| **ధృతరాష్ట్రః** | - | పౌత్ర దుర్జయ ! పితర మన్విచ్ఛ. |
| **ధృతరాష్ట్రుడు** | - | మనుమడా ! దుర్జయుడా ! నీ తండ్రిని అన్వేషింపుము. |

दुर्जयः - तात परिश्रान्तः खल्वहम्

దుర్జయః - తాత ! పరిశ్రాన్తః ఖల్వహమ్

దుర్జయుడు - తాత ! నేను అలసిపోతిని కదా !

धृतराष्ट्रः - गच्छ पितुरङ्के विश्रामस्व

ధృతరాష్ట్రః - గచ్ఛ పితురంకే విశ్రామస్వ

ధృతరాష్ట్రుడు - వెళ్ళు. నీ తండ్రి ఒడిలో విశ్రాంతిని పొందుము.

दुर्जयः - तात अहं गच्छामि (उपसृत्य) तात क्वासि ?

దుర్జయః - తాత అహం గచ్ఛామి (ఉపసృత్య) తాత క్వాసి?

దుర్జయుడు - తాత ! వెళ్ళుచున్నాను (ముందుకు నడిచి) తండ్రీ ఎక్కడున్నావు ?

राजा - अयमप्यागतः ! भोः ! सर्वावस्थायां
हृदयसंनिहितः पुत्रस्नेहो मां दहति। कुतः
दुःखानामनभिज्ञो यो ममाङ्कशयनोचितः।
निर्जितं दुर्जयो दृष्ट्वा किन्नु मामभिधास्यति ॥ 42 ॥

రాజా ! - అయమప్యాగతః । భోః సర్వావస్థాయాం
హృదయసంనిహితః పుత్రస్నేహో మాం దహతి. కుతః
దుఃఖానా మనభిజ్ఞో యో మమాంకశయనోచితః ।
నిర్జితం దుర్జయో దృష్ట్వా కిన్ను మామభిధాస్యతి ॥ 42 ॥

రాజు - ఇతడు కూడా వచ్చినాడు. అయ్యో ! అన్ని అవస్థలయందు
హృదయములో పుత్రుని పైన ఉన్న ప్రేమ నన్ను దహించుచున్నది.

భావము : కష్టములు తెలియనటువంటి, నా ఒడిలో నిదురించుటకు తగినటువంటి దుర్జయుడు ఈ రోజు నేను ఓడిపోవుటను చూచి ఏమని పలుకును ?

[यः - ఎవడైతే (దుర్జయుడు), दुःखानां = దుఃఖములను, अनभिज्ञः = తెలియనివాడు, (न अभिज्ञः - अनभिज्ञः), मम + अङ्कशयन + उचितः = నా ఒడియందు నిదురించుటకు తగినవాడు, अङ्के शयनम् अङ्कशयनम् - तस्य उचितः अङ्कशयनोचितः) निर्जितं = ఓడింపబడిన, मां = నన్ను, दृष्ट्वा = చూచి, किम् = ఏలు, अभिधास्यति = పలుకును.]

| | | |
|---|---|---|
| दुर्जय: | - | अयं महाराजो भूम्यामुपविष्ट:। |
| దుర్జయః | - | అయం మహారాజో భూమ్యాముపవిష్టః |
| దుర్జయుడు | - | మహారాజు ఇదుగో ! భూమి యందు కూర్చొనియున్నాడు. |
| राजा | - | पुत्र किमर्थमिहागत: |
| రాజా | - | పుత్ర కిమర్థమిహాగతః |
| రాజు | - | కుమారా ! ఇక్కడకు ఎందుకు వచ్చావు ? |
| दुर्जय: | - | त्वं चिरासीति। |
| దుర్జయః | - | త్వం చిరాసీతి. |
| దుర్జయుడు | - | నీవు ఆలస్యం చేసావని. |
| राजा | - | अहो अस्यामवस्थायामपि पुत्रस्नेहो हृदयं दहति। |
| రాజా | - | అహో అస్యామవస్థాయామపి పుత్రస్నేహో హృదయం దహతి. |
| రాజు | - | అయ్యో ! ఇటువంటి స్థితియందు కూడా పుత్రస్నేహము నన్ను బాధించుచున్నది. |
| दुर्जय: | - | अहमपि खलु ते अङ्के उपविशामि (अङ्कमारोहति) |
| దుర్జయః | - | అహమపి ఖలు తే అంకే ఉపవిశామి (అంకమారోహతి) |
| దుర్జయుడు | - | నేను నీ ఒడిలో కూర్చుంటాను (ఒడిలో కూర్చొనును) |
| राजा | - | (निवार्य) दुर्जय ! दुर्जय ! भो: कष्टम् हृदयप्रीतिजननो यो मे नेत्रोत्सव: स्वयम्।<br>सोऽयं कालविपर्यासात् चन्द्रो वह्नित्वमागत:। |
| రాజా | - | (నివార్య) దుర్జయ ! దుర్జయ ! భోః కష్టమ్.<br>హృదయప్రీతిజననో యో మే నేత్రోత్సవః స్వయమ్ !<br>సోఽయం కాలవిపర్యాసాత్ చంద్రో వహ్నిత్వమాగతః ॥ |
| రాజు | - | (నివారించి) ! దుర్జయా ! దుర్జయ ! అయ్యో ! ఎంత కష్టము. |

**భావము :** హృదయమునకు సంతోషమును కలిగించునటువంటి, కన్నులకు ఆనందమును కలిగించునటువంటి ఈ చంద్రుడు (ఈ దుర్జయుడు) కాలవైపరీత్యము వలన అగ్నియైనాడు.

[ हृदयस्य प्रीतिजनन: → हृदयप्रीतिजनन: = మనస్సునకు సంతోషమును కలిగించువాడు, स्वयम् = స్వయముగా, नेत्रोत्सव: = కన్నులకు ఆనందమును కలిగించువాడు, अयं चन्द्र: = ఈ చంద్రుడు, कालविपर्यासात् = విధి వైపరీత్యము వలన, वह्नित्वं = అగ్ని వంటిది, आगत: = అయ్యెను. ]

दुर्जयः - अङ्क उपवेशं किन्निमित्तं त्वं वारयसि ?

దుర్జయః - అంక ఉపవేశం కిన్నిమిత్తం త్వం వారయసి.

దుర్జయుడు - ఒడిలో కూర్చొనుచున్న నన్ను ఎందుకు నివారిస్తున్నావు ?

राजा - त्यक्त्वा परिचितं पुत्र यत्र तत्र त्वयास्यताम् ।
अद्यप्रभृति नास्तीदं पूर्वभुक्तं तवासनम् ॥ 44 ॥

రాజా - త్యక్త్వా పరిచితం పుత్ర యత్ర తత్ర త్వయాస్యతామ్ ।
అద్యప్రభృతి నాస్తీదం పూర్వభుక్తం తవాసనమ్ ॥ 44 ॥

రాజు -

భావము : కుమారా ! నీకు పరిచితమైన ఆ స్థానమును విడిచి ఎక్కడో ఒకచోట కూర్చుండుము. నీవు పూర్వమనుభవించిన ఆ ఆసనము నేటినుండి లేదు.

[पुत्र = కుమారా !, परिचितं = బాగుగా తెలిసినటువంటి, पूर्वभुक्तं = ఇదివరకు అనుభవించిన, आसनम् = ఆసనమును, त्यक्त्वा = విడిచిపెట్టి, यत्र तत्र = ఎక్కడో ఒకచోట, आस्यताम् = కూర్చుండుము, अद्यप्रभृति = నేటినుండి (ఆ ఆసనము), तव = నీవు, नास्ति = లేదు. ]

(नास्ति + इदम् - नास्तीदम् ; तव + आसनम् = तवासनम्)

दुर्जयः - कुत्र नु खलु महाराजो गमिष्यति ?

దుర్జయః - కుత్ర ను ఖలు మహారాజో గమిష్యతి ?

దుర్జయుడు - అయితే మహారాజు ఎక్కడికి వెళ్ళుచున్నాడు ?

राजा - भ्रातृशतमनुगच्छामि ।

రాజా - భ్రాతృశతమనుగచ్ఛామి.

రాజు - వందమంది సోదరులను అనుసరిస్తాను.

दुर्जयः - मामपि तत्र नय

దుర్జయః - మామపి తత్ర నయ

దుర్జయుడు - నన్ను కూడా అక్కడకు తీసికొనివెళ్ళు.

राजा - गच्छ पुत्र ! एवं वृकोदरं ब्रूहि ।

రాజా - గచ్ఛ పుత్ర! ఏవం వృకోదరం బ్రూహి.

రాజు - వెళ్ళు నాయనా ! వృకోదరుడైన భీముని అడుగుము.

दुर्जय: - एहि महाराज ! अन्विष्यसे

దుర్జయః - ఏహి మహారాజ ! అన్విష్యసే.

దుర్జయుడు - మహారాజా ఇటు రండి. మిమ్ము అన్వేషించుచున్నాను. (మీరు అన్వేషింపబడుచున్నారు)

राजा - पुत्र केन ?

రాజా - పుత్ర కేన ?

రాజు - కుమారా ! ఎవనిచే ?

दुर्जय: - आर्यया आर्येण सर्वेणान्त: पुरेण च।

దుర్జయః - ఆర్యయా ఆర్యేణ సర్వేణాంతః పురేణ చ.

దుర్జయుడు - పూజ్యురాలైన గాంధారిచే, పూజ్యుడైన ధృతరాష్ట్రునిచే అంతఃపుర స్త్రీలందరిచే.

राजा - गच्छ पुत्र ! नाहमागन्तुं समर्थ: ।

రాజా - గచ్ఛ పుత్ర ! నాహమాగన్తుం సమర్థః

రాజు - వెళ్ళు నాయనా ! నేను రాలేను.

दुर्जय: - अहं त्वां नेष्यामि

దుర్జయః - అహం త్వాం నేష్యామి

దుర్జయుడు - నేను నిన్ను తీసుకువెడతాను.

राजा - बालस्तावदसि पुत्र

రాజా - బాలస్తావదసి పుత్ర.

రాజు - నీవు బాలుడవు కుమారా !

दुर्जय: - (परिक्रम्य) आर्या: अयं महाराज: ।

దుర్జయః - (పరిక్రమ్య) ఆర్యాః అయం మహారాజః

దుర్జయుడు - (చూచి) అర్యులారా ! ఇదుగో మహారాజు

देव्यौ - हा ! हा ! महाराज:

దేవ్యౌ - హా ! హా ! మహారాజః

రాణులు - ఆ ! ఆ ! మహారాజు

धृतराष्ट्रः - क्वासौ महाराजः ?

ధృతరాష్ట్రః - క్వాసౌ మహారాజః ?

ధృతరాష్ట్రుడు - మహారాజు ఎక్కడ ?

गान्धारी - कुत्र मे पुत्रकः ?

గాంధారీ - కుత్ర మే పుత్రకః ?

గాంధారి - నా కుమారుడెక్కడ ?

दुर्जयः - अयं महाराजो भूम्यामुपविष्टः ।

దుర్జయః - అయం మహారాజో భూమ్యాముపవిష్టః

దుర్జయుడు - మహారాజు ఇదుగో. నేలపై కూర్చొనియున్నాడు.

धृतराष्ट्रः - हन्त भोः किमयं महाराजः

यः काञ्चनस्तम्भसमप्रमाणो लोके किलैको वसुधाधिपेन्द्रः ।

कृतः स मे भूमिगतस्तपस्वी द्वारेन्द्रकीलार्धसमप्रमाणः ॥

ధృతరాష్ట్రః - హన్త భోః కిమయం మహారాజః

యః కాంచనస్తంభసమప్రమాణో లోకే కిలైకో వసుధాధిపేన్ద్రః

కృతః స మే భూమిగతస్తపస్వీ ద్వారేన్ద్ర కీలార్ధసమప్రమాణః

॥ 45 ॥

ధృతరాష్ట్రుడు - అయ్యో ఇతడా మహారాజు !

**భావము** : బంగారు స్తంభముతో సమానమైన ఎత్తు కలవాడు. భూమికి ఒకేఒక ప్రభువు. అటువంటి ఈ దీనుడు (దుర్యోధనుడు) భూమిని చేరుకొని మహాద్వారమునకు ఉన్నటువంటి అర్గడియ వలె ప్రకాశించుచున్నాడు.

[ काञ्चनस्तम्भ समप्रमाणः - काञ्चनस्य स्तम्भेन समं प्रमाणः यस्य सः = బంగారు స్తంభముతో సమానమైన ఎత్తు కలిగినవాడు, लोके = లోకము నందు, एकः = ఒకే, वसुधा + अधिप + इन्द्रः → वसुधाधिपानां इन्द्रः = రాజులలో శ్రేష్ఠుడు - (రాజులకు ప్రభువు - చక్రవర్తి), सः तपस्वी = దీనుడు, भूमिं गतः = భూమిని చేరుకొని, द्वारेन्द्रकील + अर्ध समप्रमाणः → द्वारेन्द्रस्य कीलः → द्वारेन्द्रकीलः → द्वारेन्द्रकीलस्य अर्धम् → द्वारेन्द्रकीलार्धम् → तेन समं प्रमाणं यस्य सः = మహాద్వారమునకు ఉన్న సగము నేలతో సమానమైన ఎత్తు కలవానిగా, कृतः = చేయబడినాడు. ]

गान्धारी - जात सुयोधन परिश्रान्तोऽसि

గాంధారీ - జాత సుయోధన పరిశ్రాన్తోఽసి

గాంధారి - కుమారా ! సుయోధన నేను అలసిపోతిని.

राजा - भवत्या: खल्वहं पुत्र:

రాజా - భవత్యాః ఖల్వహం పుత్రః

రాజు - నేను నీ కుమారుడను కదా !

(అనగా అలసిపోలేదు అని భావము)

धृतराष्ट्र: - केयं भो:

ధృతరాష్ట్రః - కేయం భోః

ధృతరాష్ట్రుడు - ఎవరది ?

गान्धारी - महाराज ! अहमभीतपुत्रप्रसविनी

గాంధారీ - మహారాజ ! అహమభీతపుత్రప్రసవినీ

గాంధారి - మహారాజ ! భయము తెలియని కుమారునకు జన్మనిచ్చినదానను. నేను గాంధారిని.

राजा - अद्योत्पन्नमिवात्मानमवगच्छामि। भो स्तात किमिदानीं वैक्लव्येन

రాజా - అద్యోత్పన్నమివాత్మానమవగచ్ఛామి. భోస్తాత కిమిదానీం వైక్లవ్యేన.

రాజు - ఈ రోజే నేను జన్మనొందినట్లుగా తలచుచున్నాను. తండ్రీ ఎందులకు ఈ విచారము ?

(తల్లి నుండి ధైర్యము తెచ్చుకొని తండ్రిని ఓదార్చుచున్నాడు)

धृतराष्ट्र: - पुत्र कथमविक्लवो भविष्यामि।

ధృతరాష్ట్రః - పుత్ర కథమవిక్లవో భవిష్యామి.

ధృతరాష్ట్రుడు - కుమారా ! విచారము లేకుండా ఎట్లుండగలను.

यस्य वीर्य बलोत्सिक्तं संयुगाध्वरदीक्षितम्।
पूर्वं भ्रातृशतं नष्टं त्वय्येकस्मिन्हते हतम् ॥ 46 ॥

(पतति)

యస్య వీర్య బలోత్సిక్తం సంయుగాధ్వరదీక్షితమ్.
పూర్వం భ్రాతృశతం నష్టం త్వయ్యేకస్మిన్హతే హతమ్ ॥ 46 ॥

(పతతి)

భావము : శక్తి సామర్థ్యములతో కూడుకొనినటువంటి, యుద్ధమనెడి యాగమునందు దీక్ష వహించిన నీ నూర్గురు సోదరులు పూర్వము నశించిరి. నీవు మరణించగానే సర్వము నశించినది.

(పడిపోవును)

[ त्वयि + एकस्मिन् हते = నీవు ఒక్కడవు మరణించగానే, यस्य = ఎవని యొక్క वीर्यबल + उत्सिक्तं = శక్తి సామర్థ్యాలతో కూడుకొన్నటువంటి, संयुगाध्वरदीक्षितम् → संयुग: एव अध्वर: तस्मिन् दीक्षितम् = యుద్ధమనెడి యజ్ఞమునందు దీక్ష వహించిన, भ्रातृशतं = వందమంది సోదరులు, पूर्वं नष्टं = ఇదివరకే నశించిన, हतं = సర్వము (ఇప్పుడు) నశించినది. ]

राजा - हा धिक् ! पतितोऽत्रभवान्। तात ! समाश्वासय ... अत्र भवतीम्

రాజా - హాధిక్ పతితోऽత్ర భవాన్ ! తాత ! సమాశ్వాసయ అత్ర భవతీమ్.

రాజు - అయ్యో నీవు పడిపోతివికదా ! తండ్రీ ! ఈ పూజ్యురాలిని ఓదార్చుము.

धृतराष्ट्र: - पुत्र किमिति समाश्वासयामि

ధృతరాష్ట్రః - పుత్ర. కిమితి సమాశ్వాసయామి.

ధృతరాష్ట్రుడు - కుమారా ! ఏమని ఓదార్చగలను.

राजा - अपराङ्मुखो युधि हत इति। भो स्तात! शोक-निग्रहेण क्रियतां ममानुग्रह:।

त्वात्पादमात्रप्रणताग्रमौलिर्ज्वलन्तमप्यग्निमचिन्तयित्वा।

येनैव मानेन समं प्रसूतस्तेनैव मानेन दिवं प्रयामि ॥ 47 ॥

రాజా - అపరాజ్ముఖో యుధి హత ఇతి। భో స్తాత ! శోక నిగ్రహేణ క్రియతాం మమానుగ్రహః ।

త్వాత్పాదమాత్రప్రణతాగ్రమౌలిర్జ్వలన్తమప్యగ్ని మచిన్తయిత్వా ।

యేనైవ మానేన సమం ప్రసూతస్తేనైవ మానేన దివం ప్రయామి ॥ 47 ॥

రాజు - యుద్ధమునందు వెనుదిరగకుండ నీ కుమారుడు యుద్ధమునందు మరణించెను అని చెప్పుము. తండ్రీ ! నీ విచారమును తగ్గించుకొని నన్ను అనుగ్రహింపుము.

**భావము :** నీ పాదములకు మాత్రమే నమస్కరించు శిరస్సు కలిగిన, ఆత్మాభిమానముతో జన్మించిన నేను జ్వలించు అగ్నిని కూడా లెక్కింపకుండా ఆ ఆత్మాభిమానముతోనే స్వర్గమునకు వెళ్ళుచున్నాను.

[त्वत्पादमात्रप्रणताग्रमौलि: - तव पादमात्रे प्रणत: अग्रमौलि: यस्य स: = నీ పాదములకు మాత్రమే నమస్కరించు శిరస్సు కలిగిన, येन मानेन समं प्रसूत: = ఏ ఆత్మాభిమానముతో నేను జన్మించితినో, ज्वलन्तं अग्निं अचिन्तयित्वा = జ్వలించుచున్న అగ్నిని లెక్కింపకుండా, तेनैव मानेन समं = ఆ ఆత్మాభిమానముతోనే, दिवं प्रयामि = స్వర్గమునకు వెళ్ళుచున్నాను]

**धृतराष्ट्र:** - वृद्धस्य मे जीवितनि:स्पृहस्य
निसर्गसंमीलितलोचनस्य ।
धृतिं निगृह्यात्मनि संप्रवृत्त -
स्तीव्रस्समाक्रामति पुत्रशोक: ॥ 48 ॥

**ధృతరాష్ట్రః** - వృద్ధస్య మే జీవిత నిస్పృహస్య
నిసర్గ సంమీలిత లోచనస్య ।
ధృతిం నిగృహ్యాత్మని సంప్రవృత్త -
స్తీవ్రస్సమాక్రామతి పుత్రశోకః ॥ 48 ॥

**ధృతరాష్ట్రుడు** -

**భావము :** వృద్ధుడనైనటువంటి, జీవితమునందు ఆశ లేనటువంటి, పుట్టుకతోనే కన్నులను కోల్పోయినటువంటి నాకు కలిగిన ఈ పుత్రశోకము నా ధైర్యమును నాశనము చేసి నన్ను వశపరచుకొనుచున్నది.

[वृद्धस्य = వృద్ధుడనైననటువంటి, जीवितनिस्पृहस्य = జీవితము నందాశ లేనటువంటి, निसर्गसंमीलितलोचनस्य = పుట్టుకతోనే కన్నులను పోగొట్టుకొనినటువంటి, आत्मनि = నా యందు, संप्रवृत्त: = జనించిన, मे पुत्रशोक: = నా పుత్ర శోకము, धृतिं निगृह्य = ధైర్యమును నాశనము చేసి, तीव्र: समाक्रामति = తీవ్రముగా ఆక్రమించుచున్నది. ]

[जीविते नि:स्पृहा यस्य स: - जीवितनि:स्पृह:

निसर्गेण संमीलिते लोचने यस्य स: - निसर्गसंमिलितलोचन: पुत्रार्थं शोक: - पुत्रशोक: ]

बलदेव: - भो: कष्टम्

दुर्योधननिराशस्य नित्यास्तमितचक्षुष: ।

न शक्नोम्यत्रभवत: कर्तुमात्मनिवेदनम् ॥ 49 ॥

బలదేవః - భోః కష్టమ్

దుర్యోధన నిరాశస్య నిత్యాస్తమితచక్షుషః ।

న శక్నోమ్యత్రభవతః కర్తుమాత్మ నివేదనమ్ ॥ 49 ॥

బలరాముడు - అయ్యో ఎంత కష్టము ?

భావము : దుర్యోధనునికై చింతించుచున్న పూర్తిగా అంధుడైనటువంటి ఈ పూజ్యునకు (ధృతరాష్ట్రునకు) నన్ను నేను పరిచయము చేసికొనలేకపోవుచున్నాను.

[दुर्योधनार्थं निराशा यस्य स: = దుర్యోధనునికై చింతించుచున్న, नित्यम् अस्तमिते चक्षुषी यस्य स: = ఎల్లప్పుడూ చూచుటకు శక్యము కాని కన్నులు కలిగిన, अत्र भवत: = ఈ పూజ్యునకు, आत्मन: निवेदनम् = నన్ను పరిచయము చేసికొనుట, न शक्नोमि = చేయలేకపోవుచుంటిని. ]

राजा - विज्ञापयाम्यत्रभवतीम्

రాజా - విజ్ఞాపయామ్యత్ర భవతీమ్

రాజు - ఈ పూజ్యురాలికి విన్నవించదలచుచున్నాను.

गान्धारी - भण जात

గాంధారీ - భణ జాత

గాంధారి - చెప్పుము కుమారా !

राजा - नमस्कृत्य वदामि त्वां यदि पुण्यं मयाकृतम्।

अन्यस्यामपि जात्यां मे त्वमेव जननी भव ॥ 50 ॥

రాజా - నమస్కృత్య వదామి త్వాం యది పుణ్యం మయాకృతం

అన్యస్యామపి జాత్యం మే త్వమేవ జననీ భవ ॥ 50 ॥

రాజు

భావము : నీకు నమస్కరించి చెప్పుచున్నాను. నేను ఏదైనా పుణ్యము చేసినచో, రాబోవు జన్మమునందు కూడా నీవే నా తల్లివి కావలయును.

गान्धारी - मम मनोरथ: खलु त्वया भणित: ।

గాంధారీ - మమ మనోరథః ఖలు త్వయా భణితః.

గాంధారి - నీవు తెలియజేసినది నా కోరిక కదా !

राजा - मालवि त्वमपि श्रुणु

भिन्ना मे भ्रुकुटी गदानिपतितैर्व्यायुद्धकालोत्थितै
वक्षस्युत्पतितै: प्रहाररुधिरैर्हारावकाशो हत: ॥
पश्येमौ व्रणकाञ्चनाङ्गदधरौ पर्याप्तशोभौ भुजौ
भर्ता ते नपराङ्मुखो युधि हत: किं क्षत्रिये रोदिषि
॥ 51 ॥

రాజా - మాలవి త్వమపి శ్రుణు

భిన్నా మే భ్రుకుటీ గదానిపతితైర్వ్యాయుద్ధకాలోత్థితైః
ర్వక్షస్యుత్పతితైః ప్రహారరుధిరైర్హారావకాశో హృతః ।
పశ్యేమౌ వ్రణ కాంచనాంగద ధరౌ పర్యాప్తశోభౌ భుజౌ
భర్తా తే నపరాఙ్ముఖో యుధి హతః కిం క్షత్రియే రోదిషి
॥ 51 ॥

రాజు - మాలతి నీవు కూడా విను.

భావము : యుద్ధ సమయములో కలిగెడి గదాఘాతములతో నా భృకుటి భిన్నమైనది. వక్షస్థలమునందున్న గాయముల నుండి వచ్చు రక్తము హారముల స్థానమును పొందినది. గాయములనెడి బంగారు కంకణములతో ప్రకాశించుచున్న ఈ భుజములను చూడుము.

ఓ క్షత్రియురాలా ! నీ భర్త యుద్ధము నుండి పారిపోవుచూ చంపబడలేదు. ఎందుకు ఏడ్చుచున్నావు ?

[ व्यायुद्धस्य काले उत्थितै: = యుద్ధకాలమునందు సంభవించెడి, गदानिपतितै: = గదాఘాతములతో, मे = నా, भ्रुकुटी = నుదురు, भिन्ना = భిన్నమైనది, वक्षसि = వక్షస్థలమునందు, उत्पतितै: = కలిగిన, प्रहाररुधिरै: = గాయముల రక్తముతో, प्रहारस्य रुधिराणि – तै: हार + अवकाश: = హారముల అవకాశమును, हत: = పొందినది, व्रणकाञ्चनाङ्गदधरौ - व्रण: एव काञ्चनाङ्गदम्, तस्य धरौ = గాయములనెడి కంకణములను ధరించిన, पर्याप्तशोभौ = బాగుగా ప్రకాశించెడి, इमौ भुजौ पश्य = ఈ భుజములను చూడుము, क्षत्रिये = ఓ క్షత్రియురాలా ! ते भर्ता = నీ భర్త, युधि = యుద్ధమునందు, पराङ्मुख: = పారిపోవుచూ, न हत: = చంపబడలేదు, किं रोदिषि = ఎందుకు ఏడ్చుచున్నావు. ]

देवी - बाला एषा सहधर्मचारिणी रोदिमि।

దేవీ - బాలా ఏషా సహధర్మచారిణీ రోదిమి.

దేవి - చిన్నదానిని, నీ సహధర్మచారిణినియైన నేను ఏడ్చుచున్నాను.

राजा - पौरवि त्वमपि शृणु -

वेदोक्तैर्विविधैर्मखैरभिमतैरिष्टं धृता बान्धवाः

शत्रूणामुपरि स्थितं प्रियशतं न व्यंसिताः संश्रिताः।

युद्धेऽष्टादशवाहिनीनृपतयः संतापिता निग्रहे

मानं मानिनि वीक्ष्य मे न हि रुदन्त्येवंविधानां स्त्रियः॥

రాజా - పౌరవి త్వమపి శ్రుణు.

వేదోక్తైర్వివిధైర్మఖైరభిమతైరిష్టం ధృతా బాంధవాః

శత్రుణాముపరి స్థితం ప్రియశతం న వ్యంసితాః సంశ్రితాః।

యుద్ధేऽష్టాదశవాహినీ నృపతయః సంతాపితా నిగ్రహే

మానం మానిని వీక్ష్య మే న హి రుదన్త్యేవంవిధానాం స్త్రియః

॥ 52 ॥

రాజు - పౌరవి నీవు కూడా విను.

**భావము** : వేదములందు చెప్పబడిన రీతిలో అనేకములైన ప్రియములైన యాగములను చేసితిని. బంధువులు సమ్మతించిరి. శత్రువులపై యుద్ధము చేసిన నా సోదరులు, సేవకులు నన్ను మోసగించలేదు. యుద్ధములో 18 అక్షౌహిణీ సైన్యములకు చెందిన రాజులు యుద్ధమునందు బాధింపబడిరి. ఓ అభిమానధనురాలా ! ఇటువంటి శక్తి సామర్థ్యములు కలిగిన నన్ను చూచి నీ వంటి స్త్రీలు ఏడవకూడదు.

[वेदोक्तैः - वेदेन उक्तैः = వేదముచే చెప్పబడిన, विविधैः अभिमतैः मखैः = వివిధములైన ఇష్టములైన యాగములను, इष्टं = ఆచరించితిని, बान्धवाः = బంధువులు, धृता = సమ్మతించిరి, शत्रूणा उपरि = శత్రువులపై, स्थितं = ఉన్నటువంటి, प्रियशतं = వందమంది సోదరులు, संश्रिताः = అనుచరులు, न व्यंसिताः = మోసగింపలేదు, अष्टादशवाहिनीनृपतयः = 18 అక్షౌహిణుల సైన్యమునకు చెందిన రాజులు, युद्धे = యుద్ధము నందు, सन्तापिताः = బాధింపబడిరి, एवंविधानां = ఇటువంటి, मानं = శక్తిని, वीक्ष्य = చూచి, मानिनि = ఓ అభిమానధనురాలా, स्त्रियः = నీవంటి స్త్రీలు, न रुदन्ति हि = ఏడవరు కదా !]

| | | |
|---|---|---|
| पौरवी | - | एककृतप्रवेशनिश्चया न रोदिमि। |
| పౌరవీ | - | ఏకకృత ప్రవేశ నిశ్చయా న రోదిమి. |
| పౌరవి | - | నీతో అగ్నిప్రవేశము చేయదలచిన నేను ఏడ్చుటలేదు. |
| राजा | - | दुर्जय, त्वमपि श्रुणु |
| రాజా | - | దుర్జయ త్వమపి శ్రుణు |
| రాజు | - | దుర్జయా ! నీవు కూడా వినుము. |
| धृतराष्ट्रः | - | गान्धारि ! किं नु खलु वक्ष्यति ? |
| ధృతరాష్ట్రః | - | గాంధారి ! కిం ను ఖలు వక్ష్యతి. |
| ధృతరాష్ట్రుడు | - | గాంధారి. ఏమి చెప్పబోవుచున్నాడు. |
| गान्धारी | - | अहमपि तदेव चिन्तयामि |
| గాంధారీ | - | అహమపి తదేవ చింతయామి. |
| గాంధారి | - | నేను కూడా అదే ఆలోచించుచున్నాను. |
| राजा | - | अहमिव पाण्डवाः शुश्रूषयितव्याः तत्रभवत्या-श्चाम्बायाः कुन्त्या निदेशो वर्तयितव्यः। अभिमन्यो-र्जननी द्रौपदी चोभे मातृवत्पूजयितव्ये। पश्य पुत्र श्लाघ्यश्रीरभिमानदीप्तहृदयो दुर्योधनो मे पिता।<br>तुल्येनाभिमुखं रणे हत इति त्वं शोकमेवं त्यज।<br>स्पृष्ट्वा चैव युधिष्ठिरस्य विपुलं क्षौमापसव्यं भुजं<br>देयं पाण्डुसुतैस्त्वया मम समं नामावसाने जलम्। |
| రాజా | - | అహమివ పాండవాః శుశ్రూషయితవ్యాః తత్ర భవత్యాః శ్చాంబాయాః కున్త్యా నిదేశో వర్తయితవ్యః. అభిమన్యోః ర్జననీ ద్రౌపదీ చోభే మాతృవత్పూజయితవ్యే. పశ్యపుత్ర శ్లాఘ్యశ్రీరభిమానదీప్తహృదయో దుర్యోధనో మే పితా<br>తుల్యేనాభిముఖం రణే హత ఇతి త్వం శోకమేవం త్యజ,<br>స్పృష్ట్వా చైవ యుధిష్ఠిరస్య విపులం క్షౌమాపసవ్యం భుజం<br>దేయం పాండుసుతైస్త్వయా మమ సమం నామావసానే జలమ్. |
| రాజు | - | పాండవులను నన్ను వలె పూజింపవలయును. పూజ్యురాలైన కుంతి ఆదేశములను ఆచరింపవలయును. అభిమన్యుని తల్లిని, ద్రౌపదిని కూడా తల్లి వలె పూజించుము. కుమారా చూడుము. |

**భావము :** గొప్ప కీర్తితో ప్రకాశించి, అభిమానమనెడి తేజస్సుతో ప్రకాశించు నీ తండ్రి యుద్ధములో సమానుడైనవానితో చంపబడినాడను విచారమును వదిలిపెట్టుము. విశాలమైనటువంటి అలంకారములచే అలంకరింపబడిన యుధిష్ఠిరుని భుజమును తాకి, నా పేరు తలచినప్పుడు పాండు పుత్రులతోపాటు నీవు కూడా జలతర్పణములను వదిలిపెట్టుము.

[ **श्लाघ्यश्री: → श्लाघ्या श्री: यस्य स:** = కీర్తియనెడి సంపద కలిగినవాడు, **अभिमानदीप्तहृदय:** = అభిమానమనెడు కాంతితో ప్రకాశించు హృదయము కలవాడు, ( **अभिमानेन दीप्तं हृदयं यस्य स:** ) **मे पिता दुर्योधन:** = నా తండ్రియైన దుర్యోధనుడు, **तुल्येन** = సమానునితో, **अभिमुखं रणे** = ద్వంద్వ యుద్ధములో, **हत:** = చంపబడినాడు, **इति** = అని, **त्वं** = నీవు, **शोकं एव त्यज** = విచారమును వదిలిపెట్టుము, **युधिष्ठिरस्य** = యుధిష్ఠిరుని యొక్క, **विपुलं** = విశాలమైన, **क्षौम + अपसव्यं** = అలంకారములచే అలంకరింపబడిన, **भुजं स्पृष्ट्वा** = భుజమును తాకి, **मम** = నా, **नाम अवसाने** = పేరు పలుకబడినప్పుడు, **पाण्डुसुतै: समं** = పాండు పుత్రులతోపాటు, **त्वया** = నీచే, **जलं देयं** = నీరు సమర్పింపబడవలయును. ]

**बलदेव:** - अहो वैरं पश्चात्ताप: संवृत्त: । अये शब्द इव

सन्नाहदुन्दुभिनिनादवियोगमूके
विक्षिप्तबाणकवचव्यजनातपत्रे ॥
कस्यैष कार्मुकरवो हतसूतयोधे
विभ्रान्तवायसगणं गगनं करोति ॥ 54 ॥

**బలదేవః** - అహో వైరం పశ్చాత్తాపః సంవృత్తః । అయే శబ్ద ఇవ

సన్నాహదుందుభినినాదవియోగమూకే
విక్షిప్తబాణకవచవ్యజనాతపత్రే
కస్యైష కార్ముకరవో హతసూతయోదే
విభ్రాన్తవాయసగణం గగనం కరోతి ॥ 54 ॥

**బలరాముడు** - ఓహో! వైరము పశ్చాత్తాపమైనది. అరే ఏమి ఈ శబ్దము.

**భావము :** యుద్ధభేరీలు, దుంధుభిలు మ్రోగకపోవుటచే నిశ్శబ్దమైనటువంటి, బాణములు, కవచములు, వింజామరలు, ఛత్రములు, చెల్లాచెదురుగా పడియున్నటువంటి, రథసారథులు, యోధులు మరణించినటువంటి, ఈ యుద్ధభూమిలో భయపడిన కాకుల సమూహమును ఆకాశమునందు వ్యాపింపజేయుచున్న ఆ ధనుష్టంకారము ఎవరిది ?

[सन्नाहाश्च दुन्दुभिश्च तेषांनिनादेन वियोगेन मूक: = యుద్ధభేరీలు, దుంధుభిలు వాటి నినాదముల వియోగముతో నిశ్శబ్దమైన, विक्षिप्ता: बाणा:, कवचा:, व्यजना: आतपत्रा: यस्मिन् = విసరివేయబడిన బాణములు, కవచములు చమరములు, గొడుగులు కలిగినటువంటి, हतसूतयोधे = हताश्च सूताश्च योधाश्च यस्मिन् = మరణించిన రథసారథులు యోధులు కలిగిన, कार्मुकरव: = ధనుష్టంకారము ఈ యుద్ధభూమిలో, विभ्रान्तवायसगणं = భయపడిన కాకులసమూహమును, गगनं करोति = ఆకాశమున వ్యాపింపజేయుచున్నది, एष: = ఇది, कस्य = ఎవరిది? ]

(नेपथ्ये)

दुर्योधनेनाततकार्मुकेण यो युद्धयज्ञ: सहित: प्रविष्ट: ।
तमेव भूय: प्रविशामि शून्यमध्वर्युणा वृत्तमिवाश्वमेधम् ॥ 55 ॥

(నేపథ్యే)

దుర్యోధనేనాతత కార్ముకేణ యో యుద్ధయజ్ఞః సహితః ప్రవిష్టః ।
తమేవ భూయః ప్రవిశామి శూన్యమధ్వర్యుణా వృత్తమివాశ్వమేధమ్ ॥ 55 ॥

(తెర వెనుక నుండి)

**భావము :** ఏ యుద్ధమనెడి యజ్ఞభూమికి వింటినారి సారించిన దుర్యోధనునితో ప్రవేశించితినో, యజ్ఞకర్తచే (అధ్వర్యునిచే) అశ్వమేధ యాగము పూర్తిచేసి శూన్యమైనటువంటిదిగాయున్న అదే యుద్ధభూమిలోనికి మరల ప్రవేశించుచున్నాను.

[ य: = ఎవరైతే, युद्धयज्ञ: → युद्धमेव यज्ञ: = యుద్ధమనెడి యజ్ఞ భూమిలోనికి, आततकार्मुकेण - आततं कार्मुकं येन स: → तेन आततकार्मुकेण = వింటినారి సారించిన, दुर्योधनेन सहित: = దుర్యోధనునితో సహితముగా, प्रविष्ट: = ప్రవేశించితినో, अध्वर्युणा = యజ్ఞకర్తచే, वृत्तं अश्वमेधम् = అశ్వమేధ యాగము చేయబడి, शून्यं इव = శూన్యముగా ఉన్నటువంటిదిగా ఉన్న, तम् + एव = అదే యుద్ధభూమిలోనికి, भूय: = మరల, प्रविशामि = ప్రవేశించుచున్నాను. ]

बलदेव: - अये अयं गुरुपुत्रोऽश्वत्थामेत एवाभिवर्तते। य एष:

स्फुटितकमलपत्रस्पष्टविस्तीर्णदृष्टी

रुचिरकनकयूपव्यायतालम्बबाहु:।

सरभसमयमुग्रं कार्मुकं कर्षमाण:

सदहन इव मेरु: शृङ्गलग्नेन्द्रचाप: ॥ 56 ॥

(तत: प्रविशत्यश्वत्थामा)

బలదేవః - అయే అయం గురుపుత్రోऽశ్వత్థామేత ఏవాభివర్తతే. య ఏషః

స్ఫుటిత కమల పత్ర స్పష్ట విస్తీర్ణ దృష్టీ

రుచిరకనకయూపవ్యాయతాలంబబాహుః ।

సరభసమయముగ్రం కార్ముకం కర్షమాణః

సదహన ఇవ మేరుః శృంగలగ్నేన్ద్రచాపః ॥ 56 ॥

బలరాముడు - ఓ ! గురుపుత్రుడైన (ద్రోణకుమారుడైన) అశ్వత్థామ ఇటే వచ్చుచున్నాడు.

**భావము :** ఇతడు పూర్తిగా వికసించిన పద్మము యొక్క పత్రముల వలె విశాలమైన, స్ఫుటమైన కన్నులు కలవాడు. అందమైన బంగారపు యూప స్తంభము వలె పొడవైన మరియు బలిసిన బాహువులు కలవాడు. దహింపబడుచున్న మేరుపర్వతపు శిఖరముపై ఇంద్రధనుస్సు ప్రకాశించుచున్నట్లు, ఇతడు తన భయంకరమైన ధనుస్సును చేతిలోనికి తీసుకొనుచున్నాడు.

[गुरो: पुत्र: – गुरुपुत्र:, स्फुटितकमलपत्रस्पष्टविस्तीर्णदृष्टी → स्फुटितानि कमलपत्राणि इव स्पष्टे च विस्तीर्णे च दृष्टी यस्य स: = పూర్తిగా వికసించిన పద్మము యొక్క రేకుల వలె విశాలమైన, స్ఫుటమైన కన్నుల కలవాడు, रुचिरकनकयूपव्यायतालम्बबाहु: – रुचिरौ कनकयूपौ इव व्यायतौ आलम्बौ च बाहू यस्य स: = అందమైన బంగారపు యూప స్తంభముల వలె విశాలమైన మరియు పొడవైన బాహువులు కలవాడు, सरभसं = వేగముగా, उग्रं = భయంకరమైన, कार्मुकं = ధనుస్సును, कर्षमाण: = లాగుచున్న, अयं = ఇతడు, शृङ्गलग्न + इन्द्रचाप: = శిఖరములపై ఇంద్రధనుస్సుతో కూడుకొనియున్న, शृङ्गे लग्ने इन्द्रचाप: यस्य स:, सदहन: = దహింపబడుచున్న, (दहनेन सहितं) मेरु: इव = మేరుపర్వతము వలె]

(అప్పుడు అశ్వత్థామ ప్రవేశించుచున్నాడు)

अश्वत्थामा - (पूर्वोक्तमेव पठित्वा) भो भो समरसंरम्भोभय - बलजलधि सङ्गमसमयसमुत्थि तशस्त्रनक्र कृत्तविग्रहा: स्तोकावशेषस्वासानुबद्धमन्दप्राणा: समरश्लाघिनो राजान: । शृण्वन्तु शृण्वन्तु भवन्त: ।

छलबलदलितोरु: कौरवेन्द्रो न चाहं
शिथिलविफलशस्त्र: सूतपुत्रो न चाहम् ।
इह तु विजयभूमौ द्रष्टुमद्योद्यतास्त्र:
सरभसमहमेको द्रोणपुत्र: स्थितोऽस्मि ॥ 57 ॥

అశ్వత్థామా - (పూర్వోక్తమేవ పఠిత్వా) భో భో సమరసంరంభోభయ - బలజలధి సంగమసమయసముత్థి తశస్త్రనక్ర కృత్తవిగ్రహాః స్తోకావశేషశ్వాసానుబద్ధమందప్రాణాః సమరశ్లాఘినో రాజానః । శృణ్వన్తు శృణ్వన్తు భవన్తః

ఛలబలదలితోరుః కౌరవేన్ద్రో న చాహం
శిథిలవిఫలశస్త్రః సూతపుత్రో న చాహమ్
ఇహ తు విజయభూమౌ ద్రష్టుమద్యోద్యతాస్త్రః
సరభసమహమేకో ద్రోణపుత్రః స్థితోఽస్మి ॥ 57 ॥

అశ్వత్థామ - (ముందు విధముగానే పఠించి) యుద్ధోత్సాహముతో ఉభయ సైన్యములు సముద్ర సంగమ సమయములో, ఎగసిపడినట్లుగా ఎగిసిపడగా ఆయుధములనెడి మొసళ్ళచే నాశనము చేయబడిన అవయవములు కలిగినటువంటి, మిగిలిన కొద్దిపాటి శ్వాసచే ప్రాణములతో ఉన్నటువంటి, యుద్ధమునందు ప్రశంసింపదగిన కీర్తి గలిగిన ఓ రాజులారా వినండి. వినండి.

[ समरसंरम्भे = యుద్ధోత్సాహముతో, उभयबले = ఉభయసైన్యములు, जलधिसंगमसमय: = సముద్ర సంగమ సమయములో, समुत्थितानि = ఎగిసిపడిన, शस्त्रनक्रा: शस्त्राणि एव नक्रा: = ఆయుధములే మొసళ్ళుగా అయి, तै: कृत्त विग्रहा: = వాటిచే నాశనము చేయబడిన అవయవములు గలిగిన, स्तोक = కొద్దిగా, अवशेष = మిగిలిన, श्वासेन अनुबद्धा: मन्दप्राणा: येषां ते = శ్వాసచే కూడుకొనిన ప్రాణములు కలిగిన, समरश्लाघिन: → समरे श्लाघिन: = యుద్ధమునందు కీర్తింపదగిన, राजान: = రాజులారా !, भवन्त: = మీరందరు, शृण्वन्तु = వినండి. ]

**భావము :** మోసమనెడి బలముచే నాశనము చేయబడిన ఊరువులు కల దుర్యోధనుడను కాను నేను. విఫలములైన ఆయుధబలము కలిగిన కర్ణుడనూ కాదు. ఈ విజయభూమి యందు ఆయుధమును ఎక్కుపెట్టి ద్రోణ కుమారుడైన అశ్వత్థామను నేను ఒంటరిగా నిలచియుంటిని.

[ छलबलदलित + ऊरु: → छलबलेन दलितौ ऊरु यस्य स: = మోసమనెడి బలముచే నాశనము చేయబడిన ఊరువులు కల, कौरवेन्द्र: = దుర్యోధనుడను, अहं न = నేను కాదు, शिथिलविफलशस्त्र: → शिथिलानि विफलानि च शस्त्राणि यस्य स: = నిరుపయోగములైన, శక్తి హీనములైన ఆయుధములు కల, सूतपुत्र: = కర్ణుడు, अहम् न = నేను కాదు, इह = ఈ, विजयभूमौ = విజయభూమి యందు, उद्यतास्त्र: → उद्यतं अस्त्रं येन स: = ఎక్కుబెట్టబడిన ఆయుధము గలిగిన, द्रोण पुत्र: = ద్రోణుని కుమారుడైన, सरभसं = సన్నాహముతో, अहं एक: स्थित: + अस्मि = నేను ఒక్కడినే నిలచియుంటిని. ]

किमनया ममाप्यप्रतिलाभविजयश्लाघया समरश्रिया ( परिक्रम्य) मा तावत्। मयि गुरुनिवपनव्यग्रे वञ्चित: किल कुरुकुलतिलकभूतः कुरुराजः । क एतत् श्रद्धास्यति। कुत:

కిమనయా మమాప్యప్రతిలాభవిజయశ్లాఘయా సమరశ్రియా (పరిక్రమ్య) మా తావత్. మయి గురునివపనవ్యగ్రే వంచితః కిల కురుకులతిలకభూతః కురురాజః? క ఏతత్ శ్రద్ధాస్యతి । కుతః

నిరుపయోగమైన ఈ విజయకాంక్ష మరియు యుద్ధ సంపదలు నాకేల! (చూచి) అట్లు కాదు. తండ్రికి జలతర్పణములను వదులుట యందు ఆసక్తి కలిగిన కురుకుల శ్రేష్ఠుడైన దుర్యోధనుడు మోసగింపబడినాడు కదా ! ఎవడు విశ్వసింపగలడు. ఎందువలననగా -

[ न प्रतिलाभ → अप्रतिलाभ = నిరుపయోగమైన. विजय श्लाघया = విజయమనెడి కీర్తితో, समरश्रिया = యుద్ధ సంపదతో, गुरुनिवपनव्यग्रे = తండ్రికి తర్పణములను వదులుట యందు ఆసక్తి కలిగిన ]

उद्यत्प्राञ्जलयो रथद्विपगताश्चापद्वितीयै: करै -
यस्यैकादशवाहिनीनृपतयस्तिष्ठन्ति वाक्योन्मुखा: ।
भीष्मो रामशरावलीढकवचस्तातश्च योद्धा रणे
व्यक्तं निर्जित एव सोऽप्यतिरथ: कालेन दुर्योधन: ॥ 58 ॥

ఉద్యత్ప్రాంజలయో రథద్విపగతాశ్చాపద్వితీయైః కరై
ర్యస్యైకాదశవాహినీనృపతయస్తిష్ఠన్తి వాక్యోన్ముఖాః ।
భీష్మో రామశరావలీఢకవచస్తాతశ్చ యోద్ధా రణే
వ్యక్తం నిర్జిత ఏవ సోఽప్యతిరథః కాలేన దుర్యోధనః ॥ 58 ॥

**భావము :** చేతులను జోడించి, రథములు ఏనుగులను అధిరోహించి, ధనుస్సును ధరించిన 11 అక్షౌహిణుల సైన్యమునకు చెందిన రాజులు ఎవరి ఆదేశమునకై ఎదురుచూచునో, పరశురామునిచే ఛేదింపబడిన కవచము కలిగిన భీష్ముడు, నా తండ్రియైన ద్రోణుడు యోధులుగా (ఎవరి పక్షమునందు) ఉండిరో అటువంటి అతిరథుడైన దుర్యోధనుడు విధిచే నాశనము చేయబడినాడు కదా !

[उद्यत्प्राञ्जलय: → उद्यन्त: प्राञ्जलय: येषान्ते = చాచబడిన మరియు జోడించిన చేతులు కలిగిన, रथद्विप-गता: → रथा: च द्विपा: च तान् गता: = రథములు, ఏనుగులను అధిరోహించిన, चापद्वितीयै: → चाप: द्वितीय: येषां ते = ధనుస్సే సహాయముగా కలిగిన, करै: = చేతులతో, एकादशवाहिनीनृपतय: = 11 వాహినుల సైన్యమునకు చెందిన రాజులు, यस्य = ఎవని యొక్క, वाक्य + उन्मुखा: तिष्ठन्ति = మాటకు ఎదురుచూచెదరో, रामशर + अवलीढकवच: → रामस्य शरै: अवलीढ: कवच: यस्य स: = పరశురాముని బాణములచే నాశనము చేయబడిన కవచము గల, भीष्म: = భీష్ముడు, तात: च = తండ్రియైన ద్రోణుడును, रणे = యుద్ధమునందు, योद्धा: = యోధులుగా ఉందురో, स: अतिरथ: = అటువంటి అతిరథుడైన, दुर्योधन: = దుర్యోధనుడు, कालेन निर्जितं = విధిచే నిర్జింపబడినాడు, व्यक्तं एव = స్పష్టమే కదా !]

तत् क्व नु खलु गतो गान्धारीपुत्र: । (परिक्रम्यावलोक्य)

अये अयमभिहतगजतुरगनररथप्राकारमध्यगत:

समरपयोधिपारग: कुरुराज: । य एष:

मौलीनिपातचलकेशमयूखजालै

गात्रैर्गदानि पतनक्षतशोणितार्द्रै: ।

भात्यस्तमस्तकशिलातलसंनिविष्ट:

सन्ध्यावगाढ इव पश्चिमकालसूर्य: ॥ 59 ॥

भो: कुरुराज किमिदम्

తత్ క్వ ను ఖలు గతో గాంధారీపుత్రః (పరిక్రమ్యావలోక్య)

అయే అయమభిహతగజతురగనరరథప్రాకారమధ్యగతః

సమరపయోధిపారగః కురురాజః । య ఏషః

మౌలీనిపాతచలకేశమయూఖజాలై

ర్గాత్రైర్గదాని పతనక్షతశోణితార్ద్రై ।

భాత్యస్తమస్తకశిలాతలసంనివిష్టః

సంధ్యావగాఢ ఇవ పశ్చిమకాలసూర్యః ॥ 59 ॥

భోః కురురాజ కిమిదమ్

గాంధారీ పుత్రుడైన దుర్యోధనుడు ఎచ్చటకు వెళ్ళినాడో కదా ! (అటునిటు చూచి) అయ్యో ! యుద్ధమనెడు సముద్రము ఒడ్డులను దాటి, మరణించిన ఏనుగులు, గుర్రములు, యోధులు, రథములనెడు ప్రాకారము (గోడ) మధ్యభాగములో పడియున్నాడు ఇతడు.

**భావము :** కిరీటము తొలగిపోవుటచే కదలుచున్న కేశములనెడు కిరణములు కలవాడు. గదాఘాతములచే ఏర్పడిన గాయముల నుండి కారుచున్న నెత్తుటితో తడిసిన అవయవములు కలవాడు. ఇతడు సంధ్యాకాలములో పశ్చిమాద్రి శిలలకు చేరుకొనిన అస్తమించే సూర్యుని వలె ప్రకాశించుచున్నాడు.

ఓ కౌరవరాజా ! ఇదియేమి ?

[ मौलीनिपातचलकेशमयूखजालैः → मौल्याः निपातेन चलाः केशाः एव मयूखजालानि + तैः = కిరీటము తొలగిపోవుటచే కదలుచున్న శిరోజములే కిరణములుగా కలవాడు, गदायाः निपातनेन क्षतानि, तेषां शोणितेन आर्द्रैः गात्रैः = గదా ఘాతములచే ఏర్పడిన గాయముల నుండి కారుచున్న నెత్తుటితో తడిసిన అవయవములు కలవాడు, सन्ध्यावगाढः → सन्ध्यायाः अवगाढः = సంధ్యా కాలముతో కూడుకొని, अस्तमस्तकशिलातलसंनिविष्टः → अस्तमस्तकस्य शिलातलेषु संनिविष्टः = అస్తగిరి పర్వతమునందున్న శిలాతలముల పైకి చేరుకొనిన, पश्चिमकालसूर्यः इव भाति = అస్తమించే సూర్యుని వలె ప్రకాశించుచున్నాడు ]

**राजा** - गुरुपुत्र ! फलमपरितोषस्य

**రాజా** - గురుపుత్ర ! ఫలమపరితోషస్య

**రాజు** - ఓ గురుపుత్రా ! సంతోషము లేకపోవుట యొక్క ఫలితము ఇది.

**अश्वत्थामा** - भोः कुरुराज ! सत्कारमूलमावर्जयिष्यामि

**అశ్వత్థామా** - భోః కురురాజ ! సత్కారమూలమావర్జయిష్యామి.

**అశ్వత్థామ** - ఓ కౌరవరాజా ! నిన్ను సత్కరించుటకు కావలసిన వానిని ఏర్పాటు చేస్తాను.

**राजा** - किं भवान् करिष्यति ?

**రాజా** - కిం భవాన్ కరిష్యతి ?

**రాజు** - నీవేమి చేయగలవు.

**अश्वत्थामा** - श्रूयताम्

युद्धोद्यतं गरुडपृष्टनिविष्टदेह -

मष्टार्धभीमभुजमुद्यतशार्ङ्गचक्रम्।

कृष्णं सपाण्डुतनयं युधि शस्त्रजालैः

संकीर्णलेख्यमिव चित्रपटं क्षिपामि ॥ 60 ॥

**అశ్వత్థామా** - శ్రూయతామ్

యుద్ధోద్యతం గరుడపృష్టనివిష్టదేహ

మష్టార్థభీమభుజముద్యతశార్ఙ్గచక్రమ్ ।

కృష్ణం సపాండు తనయం యుధి శస్త్రజాలైః

సంకీర్ణలేఖ్యమివ చిత్రపటం క్షిపామి ॥ 60 ॥

**అశ్వత్థామ** - వినుము.

**భావము** : యుద్ధమునకు సిద్ధపడినటువంటి, గరుడుని వెనుకభాగమునందు కూర్చొని యున్నటువంటి, భయంకరములైన చతుర్భుజములతో శంఖుచక్రములతో కూడుకొనినటువంటి, రంగు రంగుల చిత్రపటము వలె పాండుకుమారులతో కూడుకొనిన శ్రీకృష్ణుని యుద్ధములో నా ఆయుధములతో విసిరివేయుదును.

[ युद्ध + उद्यतम् → युद्धोद्यम् → युद्धाय उद्यतम् = యుద్ధమునకు సిద్ధపడిన, गरुडपृष्टनिविष्टदेहम् → गरुडस्य पृष्टे निविष्टः देहः येन तम् = గరుడుని వీపుపై కూర్చొని యున్నటువంటి, अष्टार्ध = నాలుగు, भीम भुजम् = భయంకర భుజములతో, उद्यतशार्ङ्गचक्रम् = శంఖు చక్రములతో కూడుకొనిన, संकीर्णलेख्यं चित्रपटं इव = రంగురంగుల చిత్రపటము వలె, सपाण्डुतनयं = పాండు కుమారులతో కూడుకొనిన, कृष्णं = శ్రీకృష్ణుని, युधि = యుద్ధమునందు, शस्त्रजालैः = ఆయుధముల సమూహముతో, क्षिपामि = విసిరివేయుదును. ]

**राजा** - मा मा भवानेवम्

गतं धात्र्युत्संगे सकलमभिषिक्तं नृपकुलं

गतः कर्णः स्वर्गं निपतिततनुः शन्तनसुतः ।

गतं भ्रातॄणां मे शतमभिमुखं संयुगमुखे

वयं चैवं भूता गुरुसुत। धनुर्मुञ्चतु भवान् ॥ 61 ॥

రాజా - మా మా భవానేవమ్

గతం ధాత్ర్యుత్సంగే సకలమభిషిక్తం నృపకులం

గత: కర్ణః స్వర్గం నిపతితతనుః శంతనసుతః ।

గతం భ్రాతౄణాం మే శతమభిముఖం సంయుగముఖే

వయం చైవం భూతాః గురుసుత ! ధనుర్ముంచతు భవాన్

॥ 61 ॥

రాజు - నీవట్లు చేయవలదు.

**భావము** : రాజ సమూహమంతయు ఈ భూమి ఒడిలో అభిషేకింపబడింది. కర్ణుడు స్వర్గస్థుడైనాడు. శంతన సుతుడైన భీష్ముడు మరణించినాడు. యుద్ధభూమిలో నా కన్నుల ముందే నా నూర్గురు సోదరులు మరణించారు. నేను ఇటువంటి స్థితిని పొందాను. ఓ గురుపుత్రా ! అశ్వత్థామా! నీవు ధనుస్సును విడిచిపెట్టుము.

[सकलं नृपकुलं = రాజుల సమూహమంతయూ, धात्री + उत्संगे = ఈ భూమి ఒడిలో, अभिषिक्तं गतं = అభిషేకింపబడింది, कर्ण: स्वर्गं गत: = కర్ణుడు స్వర్గస్థుడైనాడు, शन्तनसुत: = శంతన కుమారుడైన భీష్ముడు, निपतिततनु: → निपतित: तनु: यस्य स: = పడిన శరీరము కలవాడు, मे भ्रात्रूणां शतं = నా వందమంది సోదరులు, संयुगमुखे = యుద్ధభూమిలో, मे अभिमुखं = నా సమక్షములో, गतं = మరణించినారు, वयं च = మేమునూ, एवं भूता: = ఇటువంటి వారిమైతిమి, गुरुसुत = గురుపుత్రా ! అశ్వత్థామా, भवान् = నీవు, धनु: मुञ्चतु = ధనుస్సును విడిచిపెట్టుము. ]

**अश्वत्थामा** - भो: कुरुराज !

संयुगे पाण्डुपुत्रेण गदापातकचग्रहे ।

सममूरुद्वयेनाद्य दर्पोऽपि भवतो हत: ॥ 62 ॥

అశ్వత్థామా - భోః కురురాజ !

సంయుగే పాండుపుత్రేణ గదాపాతకచగ్రహే

సమమూరుద్వయేనాద్య దర్పోఽపి భవతో హృతః ॥ 62 ॥

అశ్వత్థామ - ఓ కురురాజ దుర్యోధనా !

**భావము** : యుద్ధములో పాండు కుమారుడైన భీమునిచే గదాఘాతములకు, జుట్టు పట్టుకొనుట వలననూ, ఊరుద్వయ నాశముతోపాటు నీ గర్వము (అభిమానము) కూడా పోయినది.

[ संयुगे = యుద్ధభూమిలో, पाण्डुपुत्रेण = పాండు కుమారుడైన భీమునిచే, गदापातकचग्रहे → गदाया: पाता: च कचस्य ग्रह: च यस्मिन् तस्मिन् = గదాఘాతములు, కచ గ్రహణము వలన (జుట్టు పట్టుకొనుట వలన), ऊरुद्वयेन समं = రెండు తొడలతోపాటు, भवत: दर्प: अपि = నీ అభిమానము కూడా, अद्य = నేడు, हत: = దొంగిలింపబడింది. ]

**राजा:** - मा मैवम् मानशरीरा राजान: । मानार्थमेव
मया निग्रहे गृहीत: । पश्य गुरुपुत्र,
यत्कृष्टा करनिग्रहाञ्चितकचा द्यूते तदा द्रौपदी
यद्बालोऽपि हतस्तदारणमुखे पुत्रोऽभिमन्यु: पुन: ।
अक्षव्याजजिता वनं वनमृगैर्यत्पाण्डवा: संश्रिता
नन्वल्पं मयि तै: कृतं विमृशा भो दर्पाहतं दीक्षितै: ॥ 63 ॥

**రాజా** - మామైవమ్ మానశరీరా రాజానః. మానార్థమేవ
మయా నిగ్రహే గృహీతః । పశ్య గురుపుత్ర,
యత్కృష్టా కరనిగ్రహాంచితకచా ద్యూతే తదా ద్రౌపదీ
యద్బాలో ऽపి హతస్తదారణముఖే పుత్రో ऽభిమన్యుః పునః
అక్షవ్యాజజితా వనం వనమృగైర్యత్పాండవాః సంశ్రితా
నన్వల్పం మయితైః కృతం విమృశా భో దర్పాహృతం దీక్షితైః ॥ 63 ॥

**రాజు** - అట్లు కాదు. రాజులు అభిమానమనెడి శరీరము కలవారు. అభిమానము కొరకే నేను యుద్ధములోనికి ప్రవేశించితిని.
- ఓ గురుపుత్రా !

**భావము** : ద్యూతమునందు అందమైన ద్రౌపది కేశములు నా చేతితో లాగబడినవి. యుద్ధభూమిలో బాలుడైన పుత్రుడైన అభిమన్యుడు చంపబడినాడు. పాచికలనెడి మోసముతో జయించి ఆ పాండవులను మృగముల వలె అరణ్యమునకు పంపితిమి. కానీ వారు మా యందు కొద్దిపాటి గర్వమును మాత్రమే తొలగించారు. ఓ గురుపుత్ర నీవే ఆలోచించు.

[ द्यूते = జూదమునందు, करनिग्रहाञ्चितकचा → कराभ्यां निग्रहा: अञ्चिता: केशा: यस्या: सा = చేతులతో పట్టుకొనబడిన అందమైన కేశములు కల, द्रौपदी = ద్రౌపది, कृष्टा = లాగబడినది, पुत्र: अभिमन्यु: = కుమారుడైన అభిమన్యుడు, बाल: अपि = చిన్నవాడైనప్పటికిని,

तदा रणमुखे हत: = అప్పుడు యుద్ధభూమిలో చంపబడినాడు, पाण्डवा: = పాండవులు, अक्षव्याजजिता: = పాచికలనెడి మోసముతో జయింపబడి, वनं = అరణ్యములోనికి, वनमृगै: यत्: = మృగముల వలె, संश्रिता: = పంపబడినారు, तै: दीक्षितै: = ఆ దీక్షకల వారిచే, मयि = మా యందు, अल्पं = చాలా కొద్దిపాటి, दर्पाहतं = అహంకారము తొలగింపబడుట, कृतं = చేయబడింది. ]

अश्वत्थामा - सर्वथा कृतप्रतिज्ञोऽस्मि
भवता चात्मना चैव वीरलोकै: शपाम्यहम्।
निशासमरमुत्पाद्य रणे धक्ष्यामि पाण्डवान् ॥ 64 ॥

అశ్వత్థామా - సర్వథా కృతప్రతిజ్ఞోऽస్మి
భవతా చాత్మనా చైవ వీరలోకైః శపామ్యహమ్
నిశాసమరముత్పాద్య రణే ధక్ష్యామి పాండవాన్ ॥ 64 ॥

అశ్వత్థామ - నేను ప్రతిజ్ఞ చేయుచున్నాను.

భావము : నీచే, నాచే, వీరలోకమందరిచే ప్రతిజ్ఞ చేయుచున్నాను. రాత్రి యుద్ధమున కల్పించి ఆ పాండవులను యుద్ధములో సంహరించెదను.

बलदेव: - एतद्भविष्यत्युदाहृतं गुरुपुत्रेण।
బలదేవః - ఏతద్భవిష్యత్యుదాహృతం గురుపుత్రేణ.
బలరాముడు - గురుపుత్రునిచే చెప్పబడినదంత జరుగగలదు.

अश्वत्थामा - हलायुधोऽत्र भवान्।
అశ్వత్థామా - హలాయుధోऽత్ర భవాన్
అశ్వత్థామ - హలాయుధుడైన బలరాముడు ఇదుగో.

धृतराष्ट्र: - हन्त साक्षीमती खलु वञ्चना
ధృతరాష్ట్రః - హన్త సాక్షీమతీ ఖలు వంచనా.
ధృతరాష్ట్రుడు - అయ్యో వంచన కూడా సాక్షియైనది.

अश्वत्थामा - दुर्जय। इतस्तावत्।

पितृविक्रमदायाद्ये राज्ये भुजबलार्जिते।
विनाभिषेकं राजा त्वं विप्रोक्तैर्वचनैर्भव ॥ 65 ॥

అశ్వత్థామా - దుర్జయ! ఇతస్తావత్

పితృవిక్రమదాయాద్యే రాజ్యే భుజబలార్జితే,

వినాభిషేకం రాజాత్వం విప్రోక్తైర్వచనైర్భవ ॥ 65 ॥

అశ్వత్థామ - దుర్జయ! ఇటురమ్ము.

**భావము :** పితృపరాక్రమమును వారసత్వముగా పొందిన, భుజబలముతో సంపాదింపబడిన ఈ రాజ్యమునందు అభిషేకము లేకుండగ బ్రాహ్మణ వాక్కుతో నీవు రాజువు అగుము.

[ पितृविक्रमदायाद्ये – पितु: विक्रम: एव दायाद्य: यस्मिन् तस्मिन् = తండ్రి పరాక్రమమే వారసత్వమైన, भुजबलार्जिते = భుజబలముతో సంపాదింపబడిన, राज्ये = రాజ్యమునందు, विप्र + उक्तै: वचनै: = బ్రాహ్మణుని వాక్కుతో, विना + अभिषेकं = అభిషేకము లేకుండగ, त्वं = నీవు, राज्ञा भव = రాజువగుము. ]

राजा - हन्त ! कृतं मे हृदयानुज्ञातम्। परित्यजन्तीव मे प्राणा:। इमेऽत्रभवन्त: शन्तनुप्रभृतयो मे पितृपितमहा:। एतत्कर्णमग्रत: कृत्वा समुत्थितं भ्रातृशतम्। अयमप्यैरा वतशिरोविषक्त: काकपक्षधरो महेन्द्र-करतलमबलम्ब्य क्रुद्धोऽभिभाषते मामभिमन्यु:। ऊर्वश्यादयोऽप्सरसो मामभिगता:। इमे महार्णवा मूर्तिमन्त:। एता गंगाप्रभृतयो महानद्य:। एष सहस्रहंसप्रयुक्तो मां नेतुं बीरवाही विमान: कालेन प्रेषित:। अयमयमागच्छामि। (स्वर्गं गत:।)

(यवनिकास्तरणं करोति)

రాజా - హన్త। కృతం మే హృదయానుజ్ఞాతమ్ । పరిత్యజన్తీవ మే ప్రాణాః । ఇమేఽత్ర భవన్తః శంతను ప్రభృతయో మే పితృపితామహాః । ఏతత్కర్ణమగ్రతః కృత్వా సముత్థితం భ్రాతృశతమ్. అయమప్యైరావత శిరోవిషక్తః కాకపక్ష ధరో మహేంద్ర కరతలమ వలంబ్య క్రుద్ధోఽభిభాషతే మామభిమన్యుః ఊర్వశ్యాదయోఽప్సరసో మామభిగతాః । ఇమే మహార్ణవా మూర్తిమన్తః । ఏతా గంగాప్రభృతయో మహానద్యః । ఏష సహస్రహంస ప్రయుక్తో మాం నేతుం బీరవాహీ విమానః కాలేన ప్రేషితః. అయమయమాగచ్ఛామి. (స్వర్గం గతః)

(యవనికాస్తరణం కరోతి)

రాజు - అయ్యో. నా హృదయమందలి కోరిక నెరవేరినది. నా ప్రాణములు పోవుచున్నట్లున్నవి. శంతనుడు మొదలైన నా తాత ముత్తాతలిరుగో. కర్ణుని ముందుంచుకొని నా వందమంది సోదరులు వచ్చుచున్నారు. ఐరావతము నధిరోహించి, కాక పక్షధరుడైన ఇంద్రుని చేతిని ఆలంబనముగా చేసికొని అభిమన్యుడు నన్ను నిందిస్తున్నాడు. ఊర్వశి మొదలైన అప్సరసలు నాకెదురు వస్తున్నారు. మూర్తీభవించిన మహాసముద్రములివిగో. గంగా మొదలైన మహానదులివిగో. వేల హంసలతో కూడిన విమానమును నన్ను తీసుకొని వెళ్ళుటకు యముడు పంపినాడు. ఇదిగిదిగో వచ్చుచున్నాను. (స్వర్గమునకు వెళ్ళినాడు)

(తెర పడును)

[ ऐरावतस्य शिरसि विपक्त: = ఐరావతమును అధిరోహించిన, काकपक्ष: = కాకి రెక్కల వంటి కేశముడి కలిగినవాడు ]

धृतराष्ट्र: - याम्येष सज्जनधनानि तपोवनानि
पुत्र प्रणाशविफलं हि धिगस्तु राज्यम् ॥

ధృతరాష్ట్రః - యామ్యేష సజ్జనధనాని తపోవనాని
పుత్ర ప్రణాశవిఫలం హి ధిగస్తు రాజ్యమ్.

ధృతరాష్ట్రుడు - సత్పురుషులకు ధనమువంటిదైన తపోవనములకు వెళ్ళుచున్నాను. పుత్ర నాశనముచే నిరుపయోగమైన ఈ రాజ్యము ఎందులకు (ఛీ. నాకు వలదు)

[ सज्जनानां धनानि = సత్పురుషులకు ధనములు, यामि = నేను వెళ్ళుచున్నాను, पुत्राणां प्रणाशेन विफलं = పుత్రుల యొక్క నాశనముచే నిరుపయోగమైన, राज्यं = ఈ రాజ్యము, धिक् = పనికిరానిది, अस्तु = అగును గాక. ]

अश्वत्थामा - यातोऽद्य सौप्तिकवधोद्यत बाणपाणि: ।

అశ్వత్థామా - యాతోఽద్య సౌప్తికవధోద్యత బాణపాణిః

అశ్వత్థామ - రాత్రి యందు సంహారము చేయుటకై బాణములను ధరించి ఈ రోజు వెళ్ళుచున్నాను.

[ सौप्तिक = నిద్రా సమయములో, वध + उद्यत = చంపుటకు సిద్ధమై, बाणपाणि: = బాణములను చేతియందు ధరించి, अद्य यात: = నేడు వెళ్ళుచున్నాను. ]

( भरतवाक्यम् )

बलदेव: - गां पातु नो नरपति: शमितारिपक्ष: ॥ 66 ॥
(निष्क्रान्ता: सर्वे)

బలదేవః - గాం పాతు నో నరపతిః శమితారిపక్షః ॥ 66 ॥
(నిష్క్రాన్తాః సర్వే)

బలరాముడు - శత్రువులను నాశనం చేసిన రాజు ఈ భూమిని పరిపాలించును గాక.
(అందరూ నిష్క్రమింతురు)

[ भरतवाक्यम् = నాటకాంతమున అందరికీ శుభం జరగాలని కోరుకుంటూ చెప్పబడు వాక్యము. ]

ऊरुभङ्गं नाम नाटकं समाप्तम्

ఊరుభంగం నామ నాటకం సమాప్తమ్.

ఊరుభంగము అను పేరుగల నాటకము సమాప్తమైనది.